# ఆంధ్రప్రదేశ్

ఫిబ్రవరి, 1958.

సంపుటి 2 సంచిక 4

మాఘము, శాలివాహనశకము - 1879

## విషయసూచిక



— చందా వివరాలు —

సంవత్సరానికి రూ. 1-8-0 లేక 1 రూపాయి 50 నయాపైసలు

విడిప్రతి 2 అణాలు లేక 12 నయాపైసలు

ఆంధ్రప్రదేశ్ సమాచార పౌరసంబంధములశాఖచే ప్రచురింపబడి

సిటిజన్ ప్రెస్‌లో ముద్రింపబడినది.



## ముఖచిత్రం:

రిపబ్లికు దినోత్సవంనాడు సికింద్రాబాదులో జరిగిన విన్యాసం సందర్భంలో కర్నూలు (తూర్పు) జిల్లాకు చెందిన పోలీసు కానిస్టేబిలు కందాళ సుందరరాజుకు రాష్ట్ర గవర్నర్ పోలీసు పతకం బహూకరిస్తున్నదృశ్యం. అసమానమైన ధైర్య సాహసములు ప్రదర్శించినందుకుగాను శ్రీ సుందరరాజుకు ఈ పతకం ఇవ్వబడింది.

# ప్రభుత్వ సాంకేతిక కళాశాల

ఆంధ్రప్రదేశ్‌లోని ప్రధాన సాంకేతిక విద్యా సంస్థలలో హైద్రాబాదులోని ప్రభుత్వ సాంకేతిక కళాశాల ఒకటి. ఈ కళాశాలలో ప్రత్యక్ష శిక్షణకు అన్ని సదుపాయములూ వున్నవి. ముందు ముందు దీనిని విస్తృత పరచడానికి కూడా పథకములు తయారు చేయబడి వున్నవి. ఇందులోని సీట్లను హెచ్చించవలసి వున్నది. కళాశాలకు కొత్త భవనం, ఒక వసతిగృహం కూడా నిర్మింపబడ వలసి వున్నవి.

1923 లో ఉస్మానియా సెంట్రల్ టెక్నికల్ ఇన్‌స్టిట్యూటు అను పేరిట ఒక సాంకేతిక విద్యా సంస్థ స్థాపించ బడింది. ఆ సంస్థ కొన్నేండ్లు ఆర్థిక శాఖ అధ్వర్యం క్రింద పని చేసింది. ఆ తరువాత అదే ప్రమాణ బద్ధమైన సాంకేతిక కళాశాలగా అభివృద్ధి పరచబడింది. ఈ కళాశాలలో చదివిన విద్యార్థులు ఇప్పుడు నార్వే, ఇంగ్లండు మున్నగు విదేశాలలో ఉన్నత శిక్షణ పొందుతున్నారు. ఇందులో మొదట గ్రేడ్ కోర్సులు మాత్రమే బోధింప బడేవి. తరువాత నాలుగేళ్ళ డిప్లొమా కోర్సు ప్రారంభింపబడి, ఇది కళాశాలగా మార్చ బడింది. 1953 సంవత్సరం నుంచి ఇంజనీరింగు విభాగాలను వేరుచేసి, యల్.యం.ఇ,ఇ. కోర్సును రద్దుచేసి, మూడేళ్ళ డిప్లొమా కోర్సులను ప్రారంభించడం జరిగింది. ప్రస్తుతం ఈ కళాశాలలో



ప్రభుత్వ సాంకేతిక కళాశాలలో పదార్థ విజ్ఞాన శాస్త్ర ప్రయోగశాల

బోధింపబడు కోర్సుల వివరములు ఇవి :—

1. ఎలక్ట్రికల్ ఇంజనీరింగు 2. మెకానికల్ ఇంజనీరింగు 3. సివిల్ ఇంజనీరింగు 4. ఆటోమోబైలు ఇంజనీరింగు. 5. టెలికమ్యూనికేషన్ ఇంజనీరింగు.

మూడేళ్ళ డిప్లొమా కోర్సును పూర్తి చేసుకున్న అభ్యర్థులు, పరిగణింపబడిన ఏదేని ఫ్యాక్టరీలో లేదా వర్కుషాపులో ఒక సంవత్సరం పాటు ప్రత్యక్ష శిక్షణ పొందవలసి వుంటుంది. ఆ శిక్షణ పూర్తి అయిన తరువాతే వారికి డిప్లొమా ఇవ్వబడుతుంది.

## యంత్ర పరికరాలు

రాష్ట్రంలో యంత్ర పరికరాలవీ బాగా అమరి వున్న సాంకేతిక కళాశాలల్లో ఈ కళాశాల ఒకటి. ప్రత్యక్ష శిక్షణ కవసరమైన యంత్ర సామగ్రి అంతా ఇందులోవుంది. ముఖ్యంగా ఎలక్ట్రికల్ ప్రయోగ శాల ప్రత్యేకంగా చెప్పదగింది. ఇందులో అనేక విద్యుత్సంబంధమైన యంత్రపరికరాలు వున్నవి. విశ్వ విద్యాలయ విద్యార్థులుకూడా ఈ ప్రయోగ శాలకు వెళ్ళి కొన్ని ప్రయోగాలు చేస్తూ వుంటారు. హైదాబాదు విమాన క్లబ్బువారు ఈ కళాశాలకు ప్రదర్శనముల నిమిత్తమై పాత టైగర్ మాత్ విమానం బహూకరించారు. మెకానికల్, ఇంజనీరింగ్ కోర్సుల కవసరమైన యంత్ర సామగ్రి అంతా కళాశాల కున్నది. రూ. 5,000 ల ఖర్చుతో ఒక స్టీం లెబొరేటరీ నిర్మింపబడు తున్నది. స్టీము టర్బైనులు, బాయిలర్లు ఇదివరకే సమ కూర్చ బడి వున్నవి.

ఈ కళాశాలలో చదువుకొనే విద్యార్థులు



ప్రభుత్వ సాంకేతిక కళాశాల

మామూలు తరగతులకు హాజరు కావడమే గాక, వారానికి రెండు రోజులు వర్కుషాపులో పని చేయవలసి వుంటుంది. ఇందుకై మల్లేపల్లిలోని సెంట్రల్ క్రాఫ్ట్స్ ఇన్‌స్టిట్యూట్ ఉపయోగింప బడుతున్నది. ఆఖరి సంవత్సరం తరగతిలో చదివే విద్యార్థులు భాక్రానంగల్, సింద్రీ ఎరువుల ఫ్యాక్టరీ, చిత్తరంజన్ రైలింజనుల కర్మాగారం, విశాఖపట్నం నౌకానిర్మాణకేంద్రం, కిర్లోస్కర్ ఆయిల్ ఇంజన్సు, ప్రీమియర్ ఆటోమోబైల్సు, భారత్ ఎలక్ట్రిక్సు, టాటా ఇండస్ట్రీస్ వంటి ప్రసిద్ధ పారిశ్రామిక కేంద్రాలకు వెళ్ళి సాంకేతిక పరిజ్ఞానం పొందుతూ వుంటారు. ఇలా ప్రతి సంవత్సరం ఒక జట్టు పోతూ వుంటుంది. ఇందుకై విద్యార్థులకయ్యే ఖర్చులో కొంత భాగాన్ని ప్రభుత్వం భరిస్తుంది.

కళాశాల విద్యార్థులు చెల్లించవలసిన ఫీజులు కూడా తక్కువగావున్నవి. ఇంజనీరింగు విషయాలకు సంబంధించిన పుస్తకాల ఖరీదు ఎక్కువగా వుంటుంది గనకనూ, ఆ పుస్తకాలు సులభంగా లభించవు గనుకనూ, కళాశాల అధికార్లు వాటిని విదేశాల నుంచి తెప్పించి విద్యార్థులకు లభింపజేస్తూ వుంటారు. విద్యార్థులకు ఫీజు మాఫీలు, బర్సరీలు కూడా మంజూరు చేయ బడుతూవుంటవి. పోయిన సంవత్సరం ఈ కళాశాలకు చెందిన హరిజన విద్యార్థులకు, వెనుకబడిన తరగతుల విద్యార్థులకు కేంద్ర ప్రభుత్వం మొత్తం రూ 80,000/-ల ఉపకారవేతనాలు ఇచ్చింది. నిజాంట్రస్టు ఫండు నుంచి ఈ కళాశాల విద్యార్థులకు రూ. 12,000/-లు మంజూరు చేయబడ్డవి. ప్రతి సంవత్సరం తుది పరీక్షలో ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణులైన వారిలో దాదాపు 20 మందిని ఒక సంవత్సరం పాటు ఉన్నత శిక్షణకై ప్రముఖ



రసాయన శాస్త్ర ప్రయోగశాల

పారిశ్రామిక సంస్థలకు పంపడమవుతుంది. అందు నిమిత్తం ప్రతి విద్యార్థికి నెలకు 100 రూ. ల స్టైపండును కేంద్ర ప్రభుత్వం ఇస్తుంది.

ప్రణాళిక అవసరాల దృష్ట్యా, కళాశాలలోని సీట్ల సంఖ్య 180 నుంచి 230 చేయడమైనది. కొంత కాలం తరువాత ఈ సంఖ్యను ఇంకా పెంచడమవుతుంది.

ఈ కళాశాలలో ఎ. యం. ఐ. ఇ. (ఇండియా), ఎ. యం. ఐ ఇ. ఇ.(లండను), ఎ. ఐ. ఐ. మెక్. ఇ. (లండను) మొదలగు పరీక్షలకు కూర్చొనే వారి కొరకు సాయం తరగతులు కూడా నడుపబడుతవి.

కళాశాల నిమిత్తమూ, విద్యార్థుల వసతి గృహం నిమిత్తమూ చక్కని విశాలమైన భవనములను నిర్మించవలెనన్న ప్రతిపాదన ప్రభుత్వ పరిశీలనలో వున్నది.



# పారిశ్రామిక వస్తు ప్రదర్శనం

ఈ సంవత్సరం హైదరాబాదులో ఏర్పాటు చేయబడిన అఖిలభారత పారిశ్రామిక ప్రదర్శనంలో ముఖ్యంగా చెప్పుకోదగింది చిన్న మొత్తాల పొదుపు ఉద్యమంవారి స్టాలు. ఇందులో ప్రదర్శింప బడిన పటములు, నమూనాలు, చిత్రములు చదువురాని వారికి కూడా ఆ ఉద్యమం యొక్క ప్రధాన సూత్రాలను విశదపరిచేవిగా వున్నవి. బొమ్మల లాగావున్న నమూనా చిత్రాలు పిల్లలకు సైతం ఆకర్షించేట్టుగా వున్నవి. అన్ని వర్గాల ప్రజలు ఈ స్టాలులోని పటములను చూచి పొదుపు ఉద్యమం యొక్క ప్రయోజనాన్ని తెలుసుకో గలిగే వీలుంది. పొదుపుపై ఆసక్తిని కలిగించేట్టు ప్రదర్శనం ఏర్పాటు చేయబడింది. అక్కడికక్కడే చిన్న మొత్తాల పొదుపు ఉద్యమానికి పెట్టుబడి పెట్టదలచుకున్న వారికి స్టాలులో తగు ఏర్పాటు చేయబడింది.

రష్యాలో "వినిమయదారుల సహకార సంఘములు" "భారతీయ సంస్కృతి పట్ల రష్యా ప్రజల



రష్యన్ స్టాలు



రాష్ట్ర ప్రభుత్వ రహదార్ల శాఖా మంత్రి రష్యన్ స్టాలులో ప్రదర్శింపబడిన పటములను చూస్తున్నారు

ఆసక్తి" అను ప్రదర్శనం ఈ సంవత్సరపు ప్రత్యేకతల్లో ఒకటి. దీనిని భారత-సోవియట్ సంస్కృతి సంఘంవారు ఏర్పాటు చేశారు. భారత దేశంలోని వివిధ ప్రాంతాల పరిశ్రమలకూ రాష్ట్రంలోని వివిధ జిల్లాల పరిశ్రమలకూ తగు ప్రాతినిధ్యమిచ్చి, ఆ పరిశ్రమలను సమగ్రంగా ప్రదర్శించడం జరిగింది. ఈ యేటి విశేషాలలో ఉత్తరప్రదేశ్ ప్రభుత్వ చేతి పరిశ్రమల ప్రదర్శనం ఒకటి. మురాదాబాదు మొదలగు ప్రదేశాల గ్రామీణ చేతి పరిశ్రమల వస్తువులు ఎంతో ఆకర్షవంతంగా వున్నవి. యథాప్రకారం కాశ్మీరు, మైసూరు, బొంబాయి, అస్సాం రాష్ట్రాల ప్రదర్శనములు ఈ యేడాది కూడా వున్నవి. ఇక హైద్రాబాదు నగరం సహజంగానే ప్రముఖంగా ప్రదర్శనలో పాల్గొన్నది. స్థానిక మార్కెట్లకు సంబంధించిన ప్రతి సరుకు, ప్రతి ఉత్పత్తి ప్రదర్శనంలో పెట్టబడింది.

భారత రైల్వేలవారి స్టాలు మరో ఆకర్షణ. విద్యావంతులూ, చదువురానివారూ ఈ స్టాలును ఎంతో ఆసక్తితో చూచారు. భారతదేశంలో తయారు చేయబడిన ఇంజనుల నమూనాలు (ఇవి నడువగలవి), రైలు స్టేషన్ నమూనాలు, కొత్తగా ప్రవేశ పెట్టబడిన సిగ్నల్ పద్ధతి చూడదగినవి. రాష్ట్ర ప్రభుత్వశాఖలు, సాలార్జంగ్ మ్యూజియం, ఈ సంఘంవారు కూడా తమతమ స్టాల్సు ఏర్పాటు చేశారు. రాష్ట్రంలో పరిశ్రమల అభివృద్ధికిగల అవకాశాలు, ఇంతవరకు పారిశ్రామికంగా సాధింపబడిన ప్రగతి కూడా ఎంతో వివరంగా ప్రదర్శింప బడింది. రాష్ట్రాన్ని దర్శించ దలచుకున్న వారికి ఇచటి విశేషాలన్నీ ప్రదర్శింప బడినవి. కోళ్ళ ప్రదర్శనం, కుక్కల ప్రదర్శనం చక్కగా ఏర్పాటు చేయబడ్డవి. ఈ యావత్తు ప్రదర్శనం యొక్క ముఖ్యోద్దేశం దేశీయ పరిశ్రమలను గూర్చి ప్రజానీ

నికి తెలియ జేయడమేగాక అమ్మకాల ద్వారా శీయ పరిశ్రమలకు ప్రోత్సాహ మివ్వడంకూడా. ష్ట్రంలోని ప్రైవేటు పరిశ్రమలు ఈ సదవ శాన్ని బాగా వినియోగించుకొన్నవి. ప్రతి జూ వేలాది ప్రజలు ప్రదర్శనానికి వచ్చేవారు. ఖ్యంగా సెలవు రోజుల్లో జనంతో ప్రదర్శనం కిటలాడి పొయ్యేది. హైద్రాబాదు నగరంలో ప్రదర్శనం ప్రతియేటా ఏర్పాటు చేయబడుతూ వుంటుంది. ఈ నగరపు విశేషాలలో ఇదొకటి. దేశీయ పారిశ్రామికులకు, ముఖ్యంగా నిపుణులైన చేతి పరిశ్రముల వారికి ఈ ప్రదర్శనం ఒక షో రూముగా ఉపకరిస్తుంది. వారు తయారుచేసిన సరుకులను ఇందులో ప్రదర్శించి అమ్ముకోవచ్చు. కనుక దీనిని ప్రతియేటా ఇలాగే ఏర్పాటు చేస్తూ దేశీయ పరిశ్రమలకు ప్రోత్సాహ మివ్వబడగలదని ఆశించడం సమంజసమే కాగలదు.



# ప్రకృతి సౌంద్యరానికీ, చిత్రమైన సంప్రదాయాలుగల అటవికులకూ అటపట్టయిన అరకులోయ

విశాఖ పట్నానికి 71 మైళ్ళ దూరంలో సముద్ర మట్టానికి మూడువేల అడుగుల ఎత్తున అరకులోయ వుంది. ఈ ప్రాంతంలో సామాజికాభివృద్ధి కార్యక్రమం క్రింద బహుళార్థ సాధక ప్రాజెక్టు ఒకటి నెలకొల్పబడి అభివృద్ధి కార్యక్రమం అమలు జరుగుతూ వున్నది. ఈ కార్యక్రమం వల్ల, జీవితంలో ఎన్నడూ తాము రైలునుకూడా చూచి ఎరుగమని అనే మానవులు దాదాపు ముప్పై ఐదువేలమంది నవజీవితంలోకి అడుగిడుతున్నారు.

కొండ ప్రాంతాలకు చెందిన ఈ అమాయక ప్రజలు మైదాన భూములవారికి తెలియనివారు కారు. ప్రతివారం జరిగే సంతలకు ఈ గిరిజనులు ఏనాళ్ళనుంచో వస్తూనే వున్నారు. వారిని నేర్పరులైన వర్తకులు మోసగిస్తూ అధిక లాభాలు సంపాదిస్తూనే వున్నారు. అట్టి మోసాలనుంచి వారిని శాశ్వతంగా కాపాడి, శ్రమకు తగిన పూర్తి ఫలం వారు పొందునట్లు చేయుటకే ప్రభుత్వం సమగ్రమైన అభివృద్ధి కార్యక్రమాన్ని తలపెట్టింది. ఈ కార్యక్రమంలో గిరిజనులు స్వయంగా ముందుకొచ్చి సహాకరిస్తున్నారు. అనేక రంగాలలో సాధించబడిన అభివృద్ధి స్పష్టంగా కన్పిస్తూవుంది.

"అరకులోయ" అనేపేరు అరకు గ్రామంనుంచి వచ్చింది. ప్రాజెక్టు ప్రాంతంలోవున్న 64 గ్రామాలలో అరకుగ్రామం అన్నిటికంటె పెద్దది. ఈ 64 గ్రామాలకు 899 శివార్లు వున్నవి. బ్లాకుప్రాంతం జనాభా 34,569. అరకుగ్రామ జనాభా 934. ఈ గిరిజన ప్రాంతంలోని గ్రామాలన్నిటి పరిపాలనను విశాఖపట్నం జిల్లా కలెక్టరే ప్రభుత్వ ఏజంటుగా నిర్వహిస్తూ వుంటాడు. ఏజన్సీ బ్లాకు ప్రాంతం విస్తీర్ణం 247.87 చదరపు మైళ్ళు, అంటే 1,58,622 ఎకరాలు.

పూర్వం ఈ లోయ పాచిపెంట ఎస్టేటులో ఒక భాగంగా వుండేది. విశాఖపట్నం, శ్రీకాకుళం జిల్లాలలోని ఏజన్సీ ప్రాంతంలో చాలా భాగమూ, శ్రీకాకుళం జిల్లాలోని కొంత మైదాన ప్రాంతమూ పాచిపెంట ఎస్టేటులో వుండేవి. 19వ శతాబ్దిలో ఈ ఎస్టేటు విచ్ఛిన్నమై పోయింది. జయపూరు రాజాగారు జిరాయతీ గ్రామాలుగల ఏజన్సీ భాగాన్ని 61 మొఖాసా గ్రామాలనుంచి కట్టడిని వసూలు చేసే హక్కుతో సహా 1903 లో కోర్టు వేలంలో రూ. 5,60,000 లకు కొన్నారు. వీటిలో 42 జిరాయతీ గ్రామాలు, 22 మొఖాసా గ్రామాలు విశాఖపట్నం జిల్లాలోని శృంగవరపుకోట తాలూకాలో వున్నవి, మిగిలినవి శ్రీకాకుళం జిల్లాలో వున్నవి. ఎస్టేట్ల రద్దు చట్టము ననుసరించి ప్రభుత్వం ఈ ఎస్టేటును 1955 జూన్ 20 తేదీన స్వాధీన పరచుకుంది. ప్రస్తుత బ్లాకుప్రాంతం శృంగవరపు కోట తాలూకాలో వుండిన పాచిపెంట ఎస్టేటు భాగమును ఆనుకొని వుంది.

ఇది ఎక్కువగా గిరిజన ప్రాంతం. దీనికి ఉత్తరాన, పడమట ఒరిస్సా రాష్ట్రం వుంది. తూర్పున శ్రీకాకుళం జిల్లా, దక్షిణాన చింతపల్లి తాలూకాలోని హుకుంపేట జాతీయ విస్తరణ సేవా కేంద్రమూ, శృంగవరపుకోట తాలూకాలో విజయనగరం ఎస్టేటుకు చెందిన ఏజన్సీ ప్రాంతమూ వున్నవి. విజయనగరం ఎస్టేటునుకూడా ప్రభుత్వం స్వాధీన పరచుకొంది.

## మార్గం

అరకులోయను చూడవెళ్ళేవారు సాధారణంగా వాల్తేరు రైలుస్టేషనులోగాని లేదా విశాఖపట్నం స్టేషనులోగాని దిగి, అక్కడినుంచి కారుపైగాని లేక బస్సుపైగాని వెడుతారు. విశాఖపట్నంనుంచి అరకులోయ రోడ్డుమార్గాన 71 మైళ్ల దూరంలో వుంది. ఈ రోడ్డులో కొంతభాగం పర్వత ప్రదేశం గుండా వంపు సొంపులతో పోతుంది. 3,800 అడుగుల ఎత్తుకు వెళ్ళినతరువాత అక్కడినుంచి రోడ్డు పల్లపు ప్రదేశంగుండా అరకులోయలోకి పోతుంది. అరకు కాలనీకి వెళ్ళిన తరువాత ప్రయాణీకులకు ప్రాజెక్టు ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు, ఆయన సిబ్బంది కావలసిన సహాయం చేస్తారు. ఆ ఉద్యోగులంతా ప్రస్తుతం తాత్కాలికంగా వేయబడిన పూరిగుడిసెలలో నివసిస్తున్నారు

అరకులోయకు దగ్గర రైలు స్టేషను కొత్తవలస అది 58 మైళ్ల దూరంలో వుంది. శృంగవరపుకోట తాలూకా కేంద్రం ఈ లోయనుంచి 37 మైళ్ళ దూరంలో వుంది. విజయనగరం 60½ మైళ్ళ దూరంలో వుంది.

పర్వత ప్రదేశం గుండా రోడ్డుమీద వెడుతూ వుంటే చుట్టూ కొండలు, కోనలు, లోయలు, అడవి, కొలనులు సెలయేళ్ళు, పోడుసేద్యం చేయబడే భూములు, కాఫీ పళ్ళతుల తోటలు, పొలాల్లో పనిచేసే గిరిజనులు, తాము కష్టించి పండించిన ఫలసాయాన్ని మోసుకుపొయ్యే కొండజాతివారు ఇలాంటి దృశ్యాలు కమ్మని విందువుగా వుంటాయి. రోడ్డుపై ఒకచోట "అరకులోయ దృశ్యం" అని బోర్డు పెట్టబడి వుంటుంది. అక్కడ నిల్చొని చూస్తే అరకులోయ, దానిచుట్టూ రమణీయమైన పర్వత పంక్తులు, అక్కడక్కడా చిన్న చిన్న గ్రామాలు చక్కగా కనిపిస్తాయి. రోడ్డు మార్గంలో మధ్యమధ్య ఖాళీలు వచ్చినచోట్ల వంతెనలు నిర్మించబడ్డవి. ట్రావెలర్సు బంగళానుంచి రెండుమైళ్ళ దూరంలో టిడ్గా జలపాతంవుంది. ప్రయాణీకులు చూచి తీరవలసిన జలపాతమిది. గిరిజన గ్రామాలలో అరకు, మాలసింగారం, పెదలబుడు, గుంటసీమ, లైగండ, బండరవాగు, బల్లిగూడ చెప్పదగినవి. ఈ ప్రాంతంలో దేవుడికొండ అన్నిటికంటె ఎత్తయినది. అది సుంకరమెట్టకు 2¾ మైళ్ళ దూరంలో సముద్ర మట్టానికి 5396 అడుగుల ఎత్తువవుంది. ఆ తరువాత గాలికొండ చెప్పుకోదగింది. అది కాస్కి గ్రామ శివారైన కారంగి కొండకు తూర్పున దాదాపు మూడుమైళ్ళ దూరంలో సముద్ర మట్టానికి 5,390 అడుగుల ఎత్తున వుంది. ఆ తరువాత సింకారం కొండ పెద్దది. ఇది కోరాయికి తూర్పున మూడు మైళ్ళ దూరంలో సముద్ర మట్టానికి 5,300 అడుగుల ఎత్తున వున్నది. అరకులోయ బ్లాకుకు, హుకుంపేట బ్లాకుకూ దక్షిణపు హద్దులలో అరమ కొండవుంది. ఇది ఆ రెండు బ్లాకులలోను అన్నిటి కంటె ఎత్తయిన కొండ. సముద్ర మట్టానికి 5,518 అడుగుల ఎత్తున ఈ కొండ వున్నది. అరకులోయ 3,080 అడుగుల ఎత్తున వుంది. సుంకరమెట్ట 3,327 అడుగుల ఎత్తువవుంది.

అరకు లోయలో బొర్రగుహలు వున్నవి. ఇవి భూగర్భ విషయరీత్యా ప్రాముఖ్యం గలవి. వీటిలో క్యాల్సియం కార్బొనేటు (పాలరాయి) వుంది. ఈ గుహలు విశాఖపట్నం—అరకు రోడ్డుపై 52/3 మైలు వద్ద "బొర్రగుహలు" అని వ్రాయబడి వున్న బోర్డు బల్లనుంచి ఏజన్సీలో తట్టువైపు నాలుగుమైళ్ల దూరంలో వున్నవి.

ఈ లోయలో పాతాళనది అన్నిటికంటె పెద్దది. ఇది సుంకరమెట్ట, బంగారి కొండలమధ్య ఎత్తయిన పర్వత శ్రేణిలో పుట్టి బల్లిగూడా, అరకులోయ గుండా ప్రవహిస్తుంది. దీనిలో చాలా చిన్న చిన్న వాగులు కలుస్తాయి. వాటిలో బండరవాగు ప్రధానమైనది. అది దీనిలో కురిడి నిమ్మగడ్డ అనే గ్రామం దగ్గిర కలుస్తుంది. ఆ తరువాత ఈనది విశాఖపట్నం-జైపూరు రోడ్డుకు సమాంతరంగా నాలుగుమైళ్ళు ప్రవహించి ఒరిస్సాకూ ఆంధ్రకూ సరిహద్దుగా ప్రవహిస్తూ పశ్చిమోత్తరాన వాంబు గ్రామంనుంచి ఒకమైలు దూరాన ఒరిస్సా రాష్ట్రంలోకి ప్రవేశించి చివరకు మాచ్‌ఖండ్ నదిలో కలుస్తుంది.

మాచ్‌ఖండ్ నుంచి దాదాపు 70 మైళ్ళ దూరంలో అరకు కాలనీ వుంది. మాచ్‌ఖండ్

విద్యుచ్ఛక్తి ప్రాజెక్టునుంచి తీయబడిన గ్రిడ్ లైను అరకులోయ గుండానే పోతుంది. అయితే ఈ విద్యుచ్ఛక్తి లోయ ప్రజలకు ఇంకా సప్లై చేయడం లేదు. అందుకొరకై ఒక డీజెల్ సెట్టును నెలకొల్పవలెనని ప్రతిపాదింప బడింది. ఇచట ప్రభుత్వ ఫలవృక్ష క్షేత్రం వుంది. దాని విస్తీర్ణం 50 ఎకరాలు. ఈ తోటలో జామ, ద్రాక్ష, అరటి, లిచ్చీ, మామిడి, అనాస, బొప్పాయి, దానిమ్మ, పనస, ప్యాషన్ ఫ్రూట్, రేగి, కస్తూరిపండు, నిమ్మ, నారింజ మొదలగు పండ్ల చెట్లు వుంటాయి.

ఇచట క్యాబేజీ, కోసుపువ్వు, నోల్ ఖోల్, కేరట్, బీట్ రూట్, మొదలగు కూరగాయలు సంవత్సరం పొడుగునా పండించబడుతాయి. కాఫీ, సింకోనా, యూకలిప్టస్, మైరబ్లం మొదలగు పైర్లుకూడా ఈ ప్రాంతంలో కన్పిస్తాయి.

## అడవులు

ఈ అడవులలో మద్ది, ఎగిస, చింత, కానుగు, మామిడి, రెల్ల, బూరుగు, వెదురు చెట్లు వుంటాయి.

సింగారం కొండల పటవాలు భూముల్లో వాఫిల్ చెట్లను పెంచవచ్చు. పెదలబుడు లోయ నేపియర్ గడ్డిని పెంచడానికి అనువైనది. ఇక జాతి గోధుమ, వాసనగడ్డి, సింకోనా, కాఫీ, కర్పూరం మొదలగు పైరులను పండించడానికి ఈ లోయలో తగు అవకాశాలున్నవి.

శివంగులు, చిరుతపులులు, ఎలుగుబంట్లు, దుప్పులు ఈ లోయ అడవులలో వుంటాయి. పెద్దపులులు చాలా తక్కువ. రకరకాల పక్షులు కన్పిస్తాయి.

అరకు కాలనీలో కొన్నినాళ్ళు నివసించడం ఆనందకరమైన అనుభూతి. ముఖ్యంగా వేసవిలో అక్కడ వుండాలని పిస్తుంది. డిసెంబరు నెలలో చలి ఎక్కువగా వుంటుంది. అప్పుడు అక్కడికి వెళ్ళిన వారు వెచ్చదనాన్నిచ్చే రగ్గులను దుప్పట్లను కప్పుకో వలసి వుంటుంది.

## వర్షపాతం

అరకు లోయలో సగటు వర్షపాతం 56.9 అంగుళాలు. నైరుతి ఋతుపవనాలవల్ల (జూన్-జులై నుంచి సెప్టెంబరు వరకు) 35.28 అంగుళాల వర్షం కురుస్తుంది. ఈశాన్య ఋతుపవనాలవల్ల (అక్టోబరు నుంచి జనవరివరకు) 9.32 అంగుళాల వర్షం పడుతుంది. వేసవి కాలంలో (ఫిబ్రవరి నుంచి మే నెల వరకు) 2.03 అంగుళాల వర్షం పడుతుంది. ఏప్రిల్ మే నెలల్లో తరచు జల్లులు పడతాయి. ఏప్రిల్ నెలలో వడగండ్ల వాన కురుస్తుంది. డిసెంబరు జనవరి నెలల్లో మంచు కురుస్తుంది. జూన్ నుంచి అక్టోబరు వరకు పెనుగాలులు వీస్తాయి.

అరకు లోయలో వర్షపాతమును కొలిచే కేంద్రం ఒకటి వుంది.

## ఉష్ణోగ్రత

ఈ లోయలో గరిష్ఠ ఉష్ణోగ్రత 102 డిగ్రీలు. ఇది 1956 మే నెలలో వ్రాసి వుంచబడింది. 1955 డిసెంబరులో కనిష్ఠ ఉష్ణోగ్రత 37 డిగ్రీలు వుంది.

## విశ్రాంతి గృహాలు

అరకు లోయలో పబ్లికువర్క్సు శాఖవారి ట్రావెలర్స్ బంగళావుంది. ఇది మంచి భవనము. ముందుగానే తెలియపరచి దీనిని రిజర్వు చేసుకో వచ్చు.

ఈ కాలనీలో తాత్కాలికంగా ఒక షెడ్డు నిర్మింప బడింది. ఇది విశ్రాంతి గృహంగా ఉపయోగింప బడుతున్నది. దీనిలో వుండదలచు కున్నవారి వద్ద నుంచి బహు తక్కువ కిరాయా వసూలు చేయ బడుతుంది. సుంకరమెట్టలో హైవేస్ శాఖవారి విశ్రాంతి గృహంవుంది. కాలనీలో భారతీయ సంబంధమైన హోటలు, రెస్టారెంటు వున్నది. అక్కడ పండ్లు, కూరగాయలు, పాలు, పెరుగు బాగా లభిస్తాయి. వ్యవసాయ శాఖవారు ఒక డేరీ (పాడి కేంద్రము) నడుపుతున్నారు. అందులో ఉత్పత్తి ప్రతిరోజూ 80 పౌనులు.



అరకు గ్రామంలో గిరిజన స్త్రీలు



రంపెట్ల గ్రామంలో గిరిజన బాలలు స్నానాలు చేస్తున్న దృశ్యం



చింతలముడుపు గ్రామంవద్ద మరో రమణీయ ప్రదేశం

## గిరిజనులు

ఈ లోయలో అన్నిటికంటె చెప్పుకోదగిన విశేషం అక్కడి గిరిజనులు. వీరు వేషభాషలలోను, అలవాట్లలోను, విశ్వాసాల విషయంలోను చిత్రంగా కన్పిస్తారు. వీరు ఏ బెడదాలేనట్లు నిశ్చింతగా కన్పిస్తారు. వీరి జీవన విధానం అతిసామాన్య మైనది. తమ కాయకష్టానికి ప్రకృతి ప్రసాదించిన దానితోనే వీరు తృప్తి పడతారు. సుఖభోగాల కోసం తాపత్రయ పడరు. కిటికీలుకూడా లేకుండా గుండ్రంగా వుండే వీరి గుడిసెలు వీరి జీవిత విధానం ఎంత సామాన్యమైనదో తెలియు జేస్తాయి. మట్టి, వెదురు, గుంజలు, కొప్పి గడ్డి ఉపయోగించి గుడిసెలు కట్టుకుంటారు. కొన్ని అడుగుల ఎత్తున మట్టితో గోడకట్టి దానిపై వెదురు, గడ్డివేసి గుడిసె నిర్మిస్తారు. గడ్డితో వేసిన గుడిసె పైకప్పుక్రింద గుడిసె చుట్టూ నేలను తాకుతూ వుంటుంది. ఇలా వుండడం వల్ల గుడిసె లోపల రాత్రిళ్ళు వెచ్చగా వుంటుంది. గిరిజనులకు దుస్తులు అంతగా వుండవు. అందుచేత చలికాలంలో గుడిసె మధ్య చలిమంట వేసుకొని చుట్టూ కుటుంబంవారు కూర్చొని రాత్రి అంతా గడుపుతారు.

ఒక ఇంట్లో ఇద్దరు లేదా ముగ్గురు వ్యక్తులు చనిపోయి నట్లయితే ఆ ఇంటిని పూర్తిగా తగుల బెట్టుతారు.

ఒక గిరిజన వ్యక్తి మాత్రమే పక్కా ఇల్లు కట్టు కుంటున్నాడు.

గిరిజనులలో అనేక తెగల వారున్నారు. కొన్ని తెగల పేర్లు ఇవి: భగత, గదబ, కోటియా, పైడి, దొంబు, పాడి, వాల్మీకి, కబాడీ, కొండ కుమ్మరి, కమ్మర, మల్యాలు, బారంగి, ఒడియా, సామంతులు, కోడు, రాచదొర, మూకదొర, కొండకాపు, గోండు, కొండదొర, కొండి, పాం డవ, పెరజ, జోడియ, మన్యదొర, మాలి

ఈ బ్లాకులో 7,046 కుటుంబాలున్నవి. వాటిలో వ్యవసాయంపై ఆధారపడిన కుటుంబాల సంఖ్య 4,400.

మొత్తం జనాభా 34,569. వారిలో 23,566 మంది వయోజనులు 11,003 మంది పిల్లలు. పాఠశాలకు పొయ్యే వయస్సుగల పిల్లలు 3,615 మంది వున్నారు. మొత్తం జనాభాలో 1,412 మంది అక్షరాస్యులున్నారు.

ఈ ప్రాంతములో అక్షరాస్యుల శతి 3. (ప్రభుత్వోద్యోగులను కూడా మినహాయించగా).

వ్యవసాయంపై జీవిస్తున్నవారి సంఖ్య 19,048 వ్యవసాయ కూలీలు 3,782 మంది వున్నారు. భూములు లేని కూలీల సంఖ్య 3,827. భూములు వుండికూడా స్వంతంగా సేద్యం చేయనివారు ముగ్గురున్నారు, చేతిపనివారలు 250 మంది వున్నారు.

గిరిజనులు ముఖ్యంగా వ్యవసాయం, కూలీపని వృత్తులతో జీవిస్తారు. వీరు పోడు వ్యవసాయం చేస్తారు. మరి కొందరు రోడ్డుపని, భవనములు, బావుల నిర్మాణం, వరద కట్టలు వేయడం, కొండలపై దున్నడం—వంటి పనులు చేస్తారు వీరు అంతచురుకుగా పని చేయలేరు. రోజు మొత్తం మీద చూస్తే వీరు చేసేపని తక్కువగానే కన్పిస్తుంది 1947కు పూర్వం ఈ ప్రాంతంలో వెట్టి చాకిరీ వుండేది, కాని ఇప్పుడది రద్దుచేయ బడింది.

గిరిజనులలో హిందువులు, జైనులు, క్రైస్తవులు వున్నారు. జైన మతగురువులు సంవత్సరానికొక పర్యాయం ఈ లోయకు విచ్చేస్తారు క్రైస్తవులు ఇక్కడికి 1934లో వచ్చారు. 1939లో ఇక్కడ ఒక చర్చి నిర్మింప బడింది. ఇప్పుడు గిరిజనులలో 500 మంది క్రైస్తవమతం వారున్నారు. గంగగుడి అనే గ్రామం పూర్తిగా క్రైస్తవగ్రామం. ఈ గ్రామంలో 24 ఇండ్లున్నవి. కొర్రగూడు గ్రామంకూడా క్రైస్తవ గ్రామమే ఈ గ్రామంలో 16 ఇండ్లున్నవి. చినగంగగుడి, పిట్టమెలి వలస, పిల్లగూడ, కిర్లో మోడవలస, మరికొన్ని ఇతర గ్రామాలలో కూడా క్రైస్తవులున్నారు.

హిందూ మతస్థులైన గిరిజనులలో వర్ణ వ్యవస్థ అమలులో వుంది. హరిజనులవలెనే వీరిలో దొంబు అనే హీన కులస్థులున్నారు. వర్ణాంతర వివాహాలు వీరిలో పూర్తిగా నిషేధింపబడివున్నవి. వరకట్నం పద్ధతిలేదు. వీరిలో ఎక్కువగా పెండ్లిండ్లు జరిగే పద్ధతి ఇది: ఒక యువకుడు, ఒక యువతి ఒకరినొకరు ప్రేమించు కున్నట్లయితే వారు పంటలకువెళ్ళి ఆ తరవాత 24 గంటల వరకు తమ వారెవరికీ కన్పించకుండా వెళ్ళిపోతారు. అప్పుడు వారిద్దరు భార్యా భర్తలుగా పరిగణింపబడుతారు. మరో పద్ధతి ఏమిటంటే యువకుడు తాను ప్రేమిస్తున్న యువతి తల్లిదండ్రులదగ్గరికి వెళ్ళి వారికి ఒక గ్లాసు మద్యం ఇస్తాడు. వారు, వారి కూతురు దానిని స్వీకరించి నట్లయితే అప్పుడు ఆ యువకుడు, యువతి పెళ్లాడినట్లు.

పెండ్లికి పెద్దతంతు ఏమీ వుండదు. జీలుగు కల్లుతో బంధువు లందరికీ విందు చేస్తారు. ఈ కల్లు అంటే గిరిజనుల కందరికీ చాలా ఇష్టం,

ఆడ పిల్లలకు సాధారణంగా 16వ ఏట పెండ్లి అవుతుంది. అయితే పెండ్లికి కచ్చితమైన వయస్సు అంటూ లేదు. బహుభార్యాత్వం అమలులో వుంది.

కొందరు గిరిజనులు చనిపోయిన వారిని పాతి పెడతారు. మరికొందరు దహనం చేస్తారు.

ప్రతి గ్రామంలో ఒక పురోహితుడుంటాడు. అతడివద్ద పంచాంగం వుంటుంది. ఇతడే వైద్యుడుగా కూడా పనిచేస్తూ వుంటాడు. గిరిజనులలో చిత్రమైనమరో విశేషమేమిటంటే గ్రహణం పట్టినప్పుడు వీరు పెద్దగా కేకలు వేస్తూ గోలచేస్తారు. ఆగోలకు సూర్యుణ్ణిగాని లేదా చంద్రుణ్ణిగాని మింగివేస్తున్న రాహువు పారిపోతుందని వారి నమ్మకం.

ఇంట్లో శిశువు జన్మించినప్పుడు గిరిజనులు అంతగా వేడుక చేసుకోరు, ప్రసవమైన మూడవ రోజున కుటుంబంవారంతా వాగుకెళ్ళి స్నానం చేస్తారు. గిరిజనులలో స్నానంచేసే అలవాటు తక్కువ. ఎప్పుడోగాని స్నానం చెయ్యరు.

గిరిజనులు కొన్ని ముఖ్యమైన పండుగలను వేడుకగా చేసుకుంటారు. పంట కోతల తరువాత పనులన్నీ ముగుస్తాయి. అప్పుడు వీరు సరిగ్గా నెలరోజులు చిత్రిపండుగ చేసుకుంటారు. అప్పుడు ప్రతిమనిషి అడవికి వెళ్ళి ఏదో ఒక జంతువును వేటాడి చంపేవరకు ఇంటికి తిరిగిరారు. సాధారణంగా ప్రతి పంట కోతకుముందు ఒక పండుగ చేసుకుంటారు. కొర్రకొట్ట గుమ్మడికాయ పండుగ, అడ్డకాయల పండుగ, దసరా మొదలగు పండుగలను వేడుకగా చేసుకుంటారు

గిరిజనులు సాధారణంగా నలుపు రంగులో వుంటారు. కొందరు మాత్రం ఎరుపుగా అందంగా వుంటారు. వీరు ఎక్కువగా అపభ్రంశమైన ఒఢ్ర భాష మాట్లాడుతారు. కొందరు తెలుగుకూడా మాట్లాడగలరు.

వీరు వంటినిండా దుస్తులు వేసుకోరు. కారణం వీరి పేదరికమే. పురుషులు గోచీ పెట్టుకొని, పైన ఒక గుడ్డ కప్పుకుంటారు. స్త్రీలు చీరె కట్టుకొని ఆ చీరెకొంగునే వంటిమీద కప్పుకుంటారు. స్త్రీకి చీరె [illegible] ఆమె భర్త [illegible] ఇప్పుడు స్త్రీలు రాగి వెండితో చేయబడిన నగలు పెట్టుకుంటారు. చాలామంది కంచు పెట్టుకుంటారు.

గిరిజనులు ఇత్తడి పాత్రలు, కుండలు ఉపయోగిస్తారు. నిప్పు రాజెయ్యడానికి అడ్డాకులు వాడుతారు.

అడవులలో పూలు విశేషంగా వుంటాయి. స్త్రీ పురుషులందరికీ పూలంటే చాలా ఇష్టం. ఎక్కడైనా మంచి రంగు గల పూలు కన్పించాయంటే వాటిని వెంటనే కోసుకొని తలలో పెట్టుకుంటారు.

గిరిజనులలో నేరాలు చేయడం అసలు లేదు. వ్యాజ్యాలు, కోర్టు దావాలు వీరికి లేవు. ఎవరి మధ్యనైనా తగాయిదావస్తే ఎక్కువమంది ఎటు తీర్పు యిస్తే ఆతీర్పుకు కట్టుబడి వుంటారు. తప్పు

చేసినవారు జరిమానా చెల్లించాలి. ఆ డబ్బును అంతాకలిసి ఖర్చుపెట్టి వేడుక చేసుకుంటారు. గ్రామనాయకుడికి మంచి పలుకుబడి వుంటుంది. అతని నిర్ణయాలను అందరూ శిరసావహిస్తారు.

గిరిజనులు రాగులు, సాములు, బియ్యం మొదలగు ధాన్యాలను ఆహారం కొరకు ఉపయోగిస్తారు. వీరు మాంసంకూడా తింటారు. మేకలను గొర్రెలను, పశువులను పెంచుతారు. అయితే ఆ జంతువులు వారి పెంపకంలో అంత బలంగా వుండవు. వాటికి సరిగామేతవెయ్యక ప్రకృతిలో లంభిచే ఆకు అలములను తినడానికి వదిలి పెడతారు. గిరిజనులు పోతురాజు, మోదమ్మ, సూని మొదలగు దేవుళ్లను దేవతలను పూజిస్తారు. ఆ దేవతలను దున్నపోతులను, మేకలను, కోడిపెట్టలను బలి ఇస్తారు. ముఖ్యంగా అంటువ్యాధులు ప్రబలినప్పుడు ఈ బలి విశేషంగా జరుగుతుంది. వీరిలో బ్యాంకుల పద్ధతి లేదు.

వీరి సామాజిక జీవితం గమనించ దగింది. వీరు అనాధ బాలలను ఎంతో ప్రేమతో చూస్తారు. అయిదేళ్ళ వయస్సునుంచే కొడుకులు తండ్రిల వెంట వుండి వారి వృత్తులను నేర్చుకుంటూ వుంటారు. పదిహేనేళ్ళ వయస్సువొచ్చే సరికి ఆ వృత్తిలో మంచి నేర్పరులవుతారు.

గిరిజనులను సంతలు బాగా ఆకర్షిస్తాయి. అరకులో ప్రతి శుక్రవారమూ, సుంకరమెట్టలో ప్రతి ఆదివారమూ సంతలు జరుగుతాయి. వేసవి కాలపు సంతలకు జనం బాగా వస్తారు. గిరిజనులు అడవులలోలభించే వస్తువులనూ, పప్పుధాన్యములనూ ఆహార ధాన్యములనూ తీసుకొని సంతలకు వస్తారు. మైదాన భూముల వర్తకులు ఉప్పు, వస్త్రాలు, ఎండుచేపలు, కిరసనాయిలు మొదలగు సరకులు తీసుకొని సంతలకొస్తారు. ఒక సరుకిచ్చి మరో సరుకు పుచ్చుకొనే పద్ధతిపై వ్యాపారం జరుగుతుంది. నగదుబేరంకూడా వుంటుంది.

ఈ గిరిజనులకు సంగీతమన్నా, నృత్యమన్నా చాలా ఇష్టం. వీరు పాడే శంకగీతం ప్రశస్తమైనది. గోపీలీల, సోసిసేన మొదలగు నాటకాలు కూడా వీరిలో వున్నవి.

నృత్యం, సంగీతం లేకుండా ఒక్క సాయంత్రం కూడా వీరు గడపలేరు. వారు చేసే నృత్యాలలో ఈ దిగువ పేర్కొనబడినవి ప్రసిద్ధమైనవి.

1. తోయిల అను తంబురవంటి వాయిద్యంతో జోడియా పోరజా నృత్యం. ఇందులో ఇద్దరే వ్యక్తులు పాల్గొంటారు.

2. ఖడ్డుమంజ నృత్యం : (గాజులను శుభ్రపరచడం) ఇదికూడా తోయిల వాయిద్యంతో చేస్తారు. ఇందులో స్త్రీలు మాత్రమే పాల్గొంటారు.

3. తోయిలాలతో లారీ నృత్యం : ఇది నంది ఉత్సవం (అంటే శివరాత్రి) సందర్భంలో చేస్తారు.

4. జిల్కి జికర అత్తి నృత్యం : స్త్రీలు మాత్రమే పాల్గొనేది. ఎనిమిది మంది ఈ నృత్యం చేస్తారు.

5. మయూర నృత్యం : పురుషులు నెమిలి పింఛములను కట్టుకొని ఈ నృత్యం చేస్తారు. మగ నెమిలి ఆడనెమిలిని వెదుకుతూ ఎలా అరుస్తుందో అలాగే వీరుకూడా అరుస్తూ నృత్యం చేస్తారు. ఒడ్రభాషలో పాటలు పాడుతారు. నృత్యం చేసేవారిలో ఒక నాయకుడుంటాడు. అతడు నెమిలి పింఛములతో అలంకరింపబడిన పాగా పెట్టుకొంటాడు.

6. పెళ్ళి కూతురును ఇంటికి తీసుకెళ్ళడం : పెళ్లి కూతురు మధ్యన వుంటుంది. ఆవిడపై నాలుగువైపుల నిల్చున్న నలుగురు బాలురు తెరపట్టుకొని నడుస్తూ వుంటారు. వారి చుట్టూ మయూర నర్తకులు నృత్యం చేస్తారు. మయూర నర్తకులు పెళ్ళికొడుకు వైపు వారన్నమాట.

7. పోడ నృత్యం : ఇది పెళ్ళి నృత్యం. ఒక పురుషుడు తల క్రిందపెట్టి కాళ్ళు పైకెత్తి తనకు భార్య కావాలి అని చేసే నృత్యం.

8. పంటకోతల నృత్యం : ఏదో పంటను కోస్తున్నట్లుగా ప్రదర్శించే నృత్యం.

9. లోండీ నృత్యం : గోండా తెగకు చెందిన పురుషులు ఈ నృత్యం చేస్తారు.

10. కోలాటం నృత్యం : ఆడపిల్లలు కోలాటపు పుల్లలతో ఈ నృత్యం చేస్తారు.

11. గొత్తూన్ లేక పొడుమర నృత్యం : దీనిఅర్థం దున్నపోతును చంపడమన్నమాట. పూర్వం ఒక బాలికను చంపేవారు. ఇప్పుడందుకు బదులుగా దున్నపోతును చంపుతారు. ఈ నృత్యం జరుగుతున్నప్పుడు డోలు, సన్నాయి మొదలగు వాయిద్యాలుంటాయి.

## భూమి వాడకం

ఈ ప్రాంతపు భూమి రకరకాలుగా వుంటుంది. ఒకచోట గులకరాతి భూమివుంటే మరోచోట యర్రమన్నునేల వుంటుంది. అక్కడక్కడా నల్ల భూమికూడా వుంది. ఫాస్ఫేటు, పొటాష్ 1 శతికంటె తక్కువగానే వున్నవి. సాధారణ పైర్లకు కూడా నీరు, ఎరువు పెడితేనేగాని పంటలు పండవు.

ఈ ప్రాంతంలోవున్న మొత్తం భూమి 1,58,622 ఎకరాలు. అందులో 1,09,491 ఎకరాలు అడవి ప్రదేశం. 6,245 ఎకరాలు పైర్లుపండని నేల. 9,061 ఎకరాలు అడవి ప్రదేశం గాకపోయినా సాగుకు లాయకుకాని భూమి. 2,666 ఎకరాలు ప్రస్తుతం పడావాగావున్న బీడుభూమి. 31,159 ఎకరాలలో పైరు వేయడంలేదు. 6,516 ఎకరాలలోఒకటికంటె ఎక్కువమార్లు పైరు వేయబడింది. పైర్లు వేయబడే మొత్తంభూమి 37,675 ఎకరాలు. మాగాణిభూమి 3,076 ఎకరాలు. మిగిలింది వర్షాధారంవల్ల సేద్యమయ్యే మెటభూమి.

ఎక్కడో కొన్నిచోట్ల తప్ప సాధారణంగా పొలాలకు కట్టలువేసే పద్ధతి ఇక్కడ అమలులో లేదు. ఉలవవంటి పైర్లువేస్తే భూమి సారవంతం కావచ్చు. వేరుసెనగ, బంగాళాదుంప, కర్రపెండలం వంటి పంటలను పండించవచ్చు.

మే నెల మొదలు జూలై నెలవరకు పైర్లు వేయబడుతాయి. సెప్టెంబరు నుంచి డిసెంబరు వరకు పంట కోతలు జరుగుతవి. గిరిజనులు ఋతుపవనాల కాలంలో ఒక పంట పండిస్తారు.

## సాగునీరు

ఈ ప్రాంతంలో బావులు, అయిల్ ఇంజను పంపు సెట్లు లేవు. పికోట, మోటవంటి సాధనాలతో నీళ్ళను పైకి తోడే పద్ధతి కూడా లేదు. 8 చిన్నకుంటలతో వర్షాకాలంలో 29 ఎకరాలకు సాగునీరు సరఫరా చేసి పంట పండించుకుంటారు.

మూడు చిన్న కాలువలు త్రవ్వబడ్డవి. వీటివల్ల 3,600 ఎకరాలకు సాగునీరు సరఫరా అవుతుంది.

కొండలపై నుంచి వచ్చే వాగులకు తాత్కాలికంగా అడ్డుకట్టలు కట్టి, ఆ కట్టల ప్రక్కనుంచి కాలువలు తీసి భూములకు నీరు సరఫరా చేసుకుంటారు. నీటి వనరుకు రెండు వైపులా వుండే మళ్లలో మాగాణి పైరువేస్తారు. అయితే వరదలు వచ్చినట్లయితే వారు వేసిన అడ్డు కట్టలు కొట్టుకుపొయ్యే ప్రమాదం వుంది. శాశ్వతంగా నీటి మడుగులున్నచోట రెండవపంట పండించే అవకాశాలున్నవి.

మొత్తం 3,076 ఎకరాలకు నీటి సరఫరాచేసి పైర్లు పండిస్తారు. ఈ మొత్తంలో 3,011 ఎకరాల భూమికి కొండ వాగులవల్ల నీరు సరఫరా అవుతుంది.

ఏజన్సీ ప్రాంతం అభివృద్ధికై నియమింప బడిన నిపుణులు అనేక నీటి పారుదల పథకాలను సూచించారు. ఆ పథకాలు దాదాపు అన్నీ మాచ్ ఖండ్ ఆరగాణి ప్రాంతంలో వున్నవి.

## పైర్లు

పైర్లు, అవి వేయబడే భూమి వివరాలు ఇవి :

| | | | |
|---|---|---|---|
| వరి | (నీటిపారుదలతో) | 3,039 | ఎకరాలు |
| వరి | (నీటిపారుదల లేకుండా) | 5,485 | ,, |
| చెఱకు | (నీటిపారుదలతో) | 10 | ,, |
| వెల్లుల్లి | (నీటిపారుదలతో) | 27 | ,, |
| రాగులు | (నీటిపారుదల లేకుండా) | 10,886 | ,, |
| వలిసె | ,, | 6,045 | ,, |
| కందులు | ,, | 685 | ,, |
| సాములు | ,, | 8,175 | ,, |
| అల్లం | ,, | 152 | ,, |
| పసుపు | ,, | 88 | ,, |
| నువ్వులు | ,, | 3 | ,, |
| ఆముదాలు | ,, | 212 | ,, |
| కాఫీ | ,, | 118 | ,, |
| ఆవాలు | ,, | 52 | ,, |
| బటాణీలు | ,, | 78 | ,, |
| మొక్కజొన్న | ,, | 101 | ,, |
| మినుములు | ,, | 7 | ,, |
| మిరపకాయలు | ,, | 3 | ,, |
| ఫ్రెంచి చిక్కుడు | ,, | 40 | ,, |
| పొగాకు | ,, | 7 | ,, |
| జొన్న | ,, | 27 | ,, |
| గోధుమ | ,, | 7 | ,, |

## వ్యవసాయ పదతులు

గిరిజనులు కొయ్యనాగలి, పార, పలుగువంటి పాత వ్యవసాయ పనిముట్లనే వాడుతారు.

9,459 కొయ్య నాగళ్ళు, 3 చెఱకురసంతీసే సాధనాలు ఈ ప్రాంతంలో వున్నవి. అరకు లోయలో మొత్తం 48 బండ్లు వున్నవి. దుంబ్రి గూడాలో ఒకటే బండివుంది.

ఒక్కమారే నాగలితో పొలం దున్నుతారు. అంతర్ వ్యవసాయం, కలుపుతీయడం వంటి పనులు ఇక్కడ లేవు. సాధారణంగా వరి విత్తనాలను పొలంలో చల్లి వరిపంట పండిస్తారు. అంతేగాని పొలాన్ని దమ్ముచేయడం, నాట్లు వేయడం ఇక్కడ లేదు. అయితే గిరిజనులు ఎంతోబాగా వరిపొలాలను తయారు చేస్తారు. పొలాలకు కట్టలు వేయరు. అందుచేతనే ఇక్కడ భూమి తరచు కోతపడిపోతూ వుంటుంది. పైర్లమార్పిడి కూడా తక్కువే.

గిరిజనులు పశువుల పేడను ఒక చోటవేసి ఎండనిస్తారు. ఆ తరువాత దానిని పొడిచేసి పైరులకు వేస్తారు. ఇట్లా చేయడంవల్ల అందులో సత్తువ ఏమీ వుండదు.

వ్యవసాయ శాఖవారు ఇక్కడ రసాయనిక ఎరువులు, మేలురకం విత్తనాలు, మొక్కలు సప్లయి చేస్తున్నారు. కొండ జాతులవారికి కంపోస్టు ఎరువు తయారు చేయడంకూడ నేర్పబడు తున్నది.

## పశువులు

ఈ ప్రాంతంలో 9,027 ఎద్దులు, 7,094 ఆవులు, 1,960 దున్నపోతులు, 1,241 గేదెలు, 3,695 గొఱ్ఱెలు, 5,543 మేకలు, 68 చిన్నగుఱ్ఱములు వున్నవి.

ఇక్కడి జంతువులు ఎర్రగా, పొట్టిగా వుంటాయి అయితే వీనిని శాస్త్రీయంగా పెంచడానికి వీలున్నది. పాలు పెరుగు మొదలైనవి తక్కువ. పాలిచ్చే పశువులు 94 మాత్రమే వున్నవి.

పశువులకు రిండర్ పెస్టు మొదలగు వ్యాధులు వస్తూ వుంటాయి. రంగురంగుల పక్షి జాతులు, అడవి కోళ్ళు వున్నవి.

## రాకపోకలు

ఈ ప్రాంతంలో గ్రామీణ సంక్షేమ పథకం

అమలు జరుగుతున్నప్పుడు కొన్ని కచ్చారోడ్లు వేయబడ్డవి.

విశాఖపట్నంనుంచి జైపూరుకు వెళ్ళే పక్కా రోడ్డు బ్లాకు ప్రాంతంలో గుండా 19 మైళ్లు పోతుంది ఈ రోడ్డు మంచిస్థితిలో వుంది. ఈ రోడ్డు బ్లాకుయొక్క పశ్చిమ సరిహద్దును దాటిన పిమ్మట ఒరిస్సా రాష్ట్రంలోకి ప్రవేశించి జైపూరు వెడుతుంది. మధ్యదారిలో జాలాపుట్‌కు, మాచ్‌కండ్‌కూ చీలు దార్లువున్నవి.

బ్లాకు ప్రాంతంలో అరకు-పాడేరు కచ్చారోడ్డు వుంది. దీని నిడివి 9 మైళ్ళ 3 ఫర్లాంగులు. రహదార్ల శాఖవారు దీనిని 1956 మార్చి నెలా ఖరువరకు ఫేర్ వెదర్ రోడ్డుగామార్చారు. అంటే వర్షాలు లేనప్పుడు మాత్రమే ఈ రోడ్డు ఉపయోగపడుతుందన్నమాట. రెండవ ప్రణాళిక ముగినేనాటికి ఇది పక్కారోడ్డుగా చేయబడుతుంది.

ఇతర కచ్చారోడ్లు ఇవి:-

1. హాట్టగూడానుంచి పప్పుడు వలసకు.
2. జన్నంగూడానుంచి సుంకరమెట్టకు.
3. మాదగడనుంచి జన్నంగూడాకు.
4. ఫణిరంగిణినుంచి పెదలబుడువరకు.
5. పెదలబుడునుంచి దుమ్మగుడివరకు.
6. అరకు కాలనీనుంచి హాట్టగూడాకు.
7. అరకునుంచి పొట్టంగికి. [ఒరిస్సారాష్ట్రంలో] ఇప్పుడది సరిగాలేదు.

మొత్తం కచ్చారోడ్లు నిడివి 30 మైళ్లు.

గిరిజనులు తమ వ్యవసాయోత్పత్తులను పశువులపైన కంచర గాడిదలపై నవేసి ఒక చోటినుంచి మరొకచోటికి తీసుకెడతారు.

## మంచినీటి సరఫరా

ఈప్రాంతంలో 29 పక్కా బావులున్నవి. 24 గులక రాతివి, 4 పక్కా బావులు.
కొండ వాగులనుంచి కొలనులనుంచి త్రాగే నీరు ఉపయోగిస్తారు. అయితే వేసవిలో నీటి ఎద్దడి వుంటుంది.

25 మొదలు 40 అడుగుల లోతున నీరు పడుతుంది. అందుచేత బావులు త్రవ్వించాలంటే ఖర్చు ఎక్కువ అవుతుంది.



# నల్లగొండ

నల్గొండజిల్లా వైశాల్యం 5431. 4. చ. మైళ్లు. ఈ జిల్లాలో తెలుగు ముఖ్యభాష. ప్రజలు చాల మంది ఉర్దూకూడా మాట్లాడుతారు. ఈ జిల్లాలో కృష్ణా, మూసీ ముఖ్యనదులు. కృష్ణానది దేవరకొండ, మిర్యాలగూడ, హుజూరునగరు తాలూకాల సరిహద్దులగుండా ప్రవహించుచున్నది. మూసీనది భోనగిరి, రామన్నపేట, సూర్యాపేటల మీదుగా ప్రవహిస్తూ మిర్యాలగూడలోని వాడపల్లి వద్ద కృష్ణతో కలియుచున్నది. నల్గొండపట్టణం సముద్ర మట్టానికి 7056.91 అడుగుల ఎత్తులో నున్నది.

జనాభా:- నల్గొండజిల్లా జనాభా 12,52,810. ఇందులో పురుషుల సంఖ్య 6,44,144, స్త్రీలసంఖ్య 6,08,666, భూమ్యాదాయం రు. 37,29,911 లు (సెత్వార్ ప్రకారం)

| | | |
|---|---|---|
| ఖుష్కీభూమి | 23,69,357.20 | ఎకరాలు |
| తరీభూమి | 2,59,220 | ఎకరాలు |

శీతోష్ణస్థితి:- పొడిగాను, వేసవిలో చాలా వేడిగాను వుంటుంది. గరిష్ఠ ఉష్ణోగ్రత 105 డిగ్రీలు.

వర్షపాతం:- జిల్లాలో సగటు వర్షపాతం 28.69 అంగుళములు. వర్షపాతంజిల్లా అంతటా ఒకేవిధంగా వుండదు. మిర్యాలగూడ దేవరకొండ తాలూకాలలో వర్షం ఇతరచోట్లకన్నా తక్కువ పడుతుంది. పంటలు చాలవరకు వర్షంపైననే ఆధారపడి ఉంటాయి. దేవరకొండ, మిర్యాలగూడలోను, నల్గొండ తాలూకాలో కొంత ప్రాంతంలోను వర్షాలు సరిగా పడకపోవడంవల్ల ఆ ప్రాంతం తరచు కరువుకుగురి అవుతూవుంటుంది.

వ్యవసాయం:-(ఖుష్కీభూమి) రబ్బీ జొన్నపంట విశేషంగా పండించబడుతుంది. వాణిజ్య పంటలలో ఆముదాలు, వేరుసెనగ ముఖ్యమైనవి. ఆముదాలు దేవరకొండలోను, వేరుసెనగ హుజూరునగరు, సూర్యాపేట, మిర్యాలగూడ తాలూకాలలోను విశేషంగా పండుతాయి.

తరీభూమి:- చిన్న నీటి వనరుల క్రింద వరి పండించబడుతుంది. ప్రతి సంవత్సరం ఎంత భూమిలో వరి పండించేదీ, వర్షంపైన ఆధారపడి వుంటుంది. నల్గొండజిల్లాలో కరువు పరిస్థితులను తొలగించుటకు యీ క్రింద పేర్కొనబడిన చిన్న ఇర్రిగేషను ప్రాజెక్టులు నిర్మించబడినవి.

1. దిండిప్రాజెక్టు, 2. పెండ్లిపాకలప్రాజెక్టు. 3. భీమునపల్లి ప్రాజెక్టు.

మిర్యాలగూడ తాలూకాలోని నందికొండ గ్రామానికి సమీపాన మరొక చాలపెద్ద ప్రాజెక్టు నిర్మించబడుతున్నది. అదే నాగార్జునసాగరుప్రాజెక్టు ఈ ప్రాజెక్టు నిర్మాణం పూర్తయినపుడు మిర్యాలగూడ, హుజూరు నగరు తాలూకాల పైరులకు ఈ ప్రాజెక్టునుంచి నీరు లభించగలదు. అప్పుడు ఈ జిల్లా ఆహారపరిస్థితి చక్కబడుటయేగాక, ఆర్థిక పరిస్థితులుకూడా బాగుపడుతాయి.

భూసారం:- భూమి అంత మంచిదికాదు. నల్లరేగడి భూమి చాల తక్కువగా వుంది. ఎర్రభూమి యెక్కువగావుంది. అందుకనే యీ భూమి వేరుసెనగ ఆముదాల పంటలకు అనువుగావుంది. చెఱకు, పొగాకు పంటలు పండుతున్నాయి. కాని అవి లెక్కలోకిరావు. భూసారం తక్కువగా వున్నందున యీ జిల్లా చాలా వెనకబడి యున్నది.

రాకపోకల సౌకర్యాలు :- తాలూకా ప్రధాన కేంద్రాలను మాత్రమే పబ్లిక్ వర్క్సు శాఖ రోడ్లు కలుపుతున్నవి. ఈ జిల్లాలో 29 మైళ్ళ పొడవున ఒక రైలు మార్గమున్నది. అదీ భోనగిరి తాలూకాలో కొంత భాగంలో మాత్రమే వుంది.



మెదక్ జిల్లా
కరీంనగర్ జిల్లా
పట్టణము
రైలు
రోడ్డు
నది
చిర్యాల్
జనగాం
వరంగల్
విజయవాడ కు
వరంగల్ జిల్లా
భువనగిరి
హైదరాబాద్ నుండి
దరాబాద్ జిల్లా
హైదరాబాద్ నుండి
ఖమ్మం కు
సూర్యాపేట
ఖమ్మం కు
నల్లగొండ
మిర్యాలగూడ
హుజుర్‌నగర్
విజయవాడ కు
కృష్ణా జిల్లా
దేవర్‌కొండ
కుర్తి నుండి
గుంటూరుకు
కృష్ణా నది
అచ్చంపేట నుండి
డిండి నది
గుంటూరు జిల్లా
మహబూబ్‌నగర్ జిల్లా

ఈ జిల్లాలో రోడ్లను యెక్కువగా వేయవలసిన అవసరం చాలా వుంది.

పరిశ్రమలు:- ఈ జిల్లాలో చెప్పుకోదగిన పరిశ్రమలు లేవు. ఉత్తరోత్తరా అభివృద్ధి చెందే అవకాశాలు కూడా చాల తక్కువగానే ఉంటాయని చెప్పవచ్చును.

దర్శనీయమైన స్థలాలు:- యాదగిరిగుట్ట, భోనగిరి తాలూకాలోని యాదగిరి గుట్టపైన శ్రీలక్ష్మి నృసింహస్వామి దేవాలయముంది. ఇది హైదరాబాదు-కాజీపేట లైనులో రాయగిరి రైల్వే స్టేషనుకు 3 మైళ్ల దూరంలో వుంది. ఇది బహు పురాతనమైన దేవాలయం. దక్షిణ భారతంలో సుప్రసిద్ధమైన దేవాలయాలలో ఇదొకటి. ఇక్కడ యాత్రికుల సౌకర్యార్థం సుమారు 140 ధర్మశాలలు విద్యుచ్ఛక్తి, రక్షిత నీటి సరఫరా సౌకర్యాలు వున్నాయి.

జైన మందిరము:- భోనగిరి తాలూకా కొలనుపాక గ్రామంలో ఒక జైన మందిరముంది. దక్షిణ భారతదేశంలో గల ప్రధాన జైనమందిరములలో ఇదొకటి. ఇక్కడ కొన్ని సుందర విగ్రహములున్నవి. ఇందులో ఒకటి సానరాయితోను మరొకటి ఫిరోజరాతితోను మలచబడినవి. వీరనారాయణ స్వామి దేవాలయము, సోమేశ్వర దేవాలయము, లక్ష్మీ ఆలయము కూడా ముఖ్యమైనవే.

కొలనుపాక గ్రామం ఆలేరు స్టేషనుకు 3 మైళ్ల దూరములో నున్నది.

పానగల్లు దేవాలయము:- ఇది నల్గొండ పట్టణానికి 2 మైళ్ల దూరంలో వుంది. కాకతీయుల కాలం నాటి దేవాలయ మొకటి ఇక్కడ వుంది. ఇది శిల్పకళకు ప్రసిద్ధికెక్కినది. శిల్పకళా సౌందర్యం దృష్ట్యా, సూర్యాపేట తాలూకాలోని పిల్లలమర్రి దేవాలయం, నాగులపాడు దేవాలయాలు, మిర్యాల గూడ తాలూకాలోని కాంనేకల్లు దేవాలయం కూడా ముఖ్యమైనవి.

ఈ దేవాలయాన్నీ ఒకే కాలంలో నిర్మించబడినవి. శిల్పకళ ఒకే కోవకు చెందినట్టిది.

వాడపల్లి :- అగస్త్యేశ్వరస్వామి. లక్ష్మీనృసింహస్వామి దేవాలయాలు చాల ప్రసిద్ధికెక్కినవి. ఇవి చారిత్రకంగా కూడా ముఖ్యమైనవే. ఇక్కడనే మూసీనది కృష్ణలో సంగమించుచున్నది.



# ఆంధ్రప్రదేశ్‌లో అటవీ సంపద అభివృద్ధి

శ్రీ దౌలత్‌రాయ్

(అడవుల చీఫ్ కన్సర్వేటర్.)

ఆంధ్రప్రదేశ్‌లో అడవుల మొత్తం వైశాల్యం సుమారు 24,700 చదరపు మైళ్లు వుంది. అంటే రాష్ట్రంయొక్క మొత్తం వైశాల్యంలో 23 శాతం అడవులే ఆక్రమించి వున్నాయన్న మాట. జాతీయ ఆటవీ విధానం ప్రకారం దేశ భూభాగంలో మూడోవంతు అడవులుండాలి. ప్రతి రాష్ట్రమూ అటవీ ప్రాంతాన్ని వృద్ధి పరచినట్లయితేనే ఈ లక్ష్యాన్ని సాధించ గలుగుతాం. ఈ సందర్భంలో గుర్తుంచుకోవలసిన మరో విషయ మేమంటే నీటి ఆకర్షణ ప్రాంతంలోనున్న కొండ ప్రాంతాలలో చెట్లు చేమలు లేనట్లయితే, వర్షాలకూ, వరదలకూ భూమి కోసుకొని పోయి సారవంతమైన మట్టి కొట్టుకొని పోతుంది. అందువల్ల అట్టి తావులలో విశేషంగా అడవులు పెంచినట్లయితే భూమి కోరుసుకొని పోవడాన్ని చాలావరకు నిరోధించ వచ్చును. మన రాష్ట్రంలో ఇంకా 11,000 చ. మైళ్ళలో అడవులు వేయాల్సి వున్నది. ఇప్పుడున్న అడవులు అంతగా అభివృద్ధి చెందినవి కావు. ముండ్ల పొదలున్న అడవులే ఉన్నాయి. అనేక కొండల్లోని అడవులు బీడు పడిపోయి వున్నాయి.

పరిపాలనా నిర్వహణ దృష్ట్యా మన రాష్ట్రపు అడవులను నాల్గు భాగములుగా విభజింప వచ్చును. వాటి వివరములు:

| | ఆంధ్ర. | తెలంగాణా |
|---|---|---|
| | చ. మై. | |
| 1. అటవీశాఖ అధ్వర్యం క్రింద నున్న రిజర్వు అడవులు | 9,000 | 5,600 |
| 2. అటవీశాఖ స్వాధీన పరచుకొన్న పంచాయతీల అడవులు | 2,000 | — |
| 3. అటవీశాఖ స్వాధీన పరచుకొన్న జమీందారీ, జాగీర్దారీ అడవులు | 3,600 | 2,600 |
| 4. ఇతర అడవులు | — | 1,900 |
| మొత్తం | 14,600 | 10,100 |

అటవీశాఖ అధ్వర్యం క్రిందనున్న రిజర్వు అడవులు చాలకాలం వరకు శాస్త్రీయ పద్ధతిన ఉపయోగించబడినవి. కాని ద్వితీయ ప్రపంచ యుద్ధం కాలంలోనూ, ఆతరువాతనూ, రక్షణశాఖ ఉపయోగార్థం అవి విశేషంగా నరికి వేయబడినవి.

## పంచాయతీల అడవులు

ఆంధ్రప్రాంతంలో పంచాయతీల క్రిందవున్న అడవులుకూడా రిజర్వు అడవులే. 1922-26 సంవత్సరములమధ్య ఇవి గ్రామ పంచాయతీల పరం చేయబడినవి. ఈ అడవులు అంత శ్రేష్ఠమైనవి గానందున వాటిని అటవీశాఖకు చెందిన సాంకేతిక అధికారులు పర్యవేక్షించ నవసరంలేదని అప్పుడు భావించబడింది. అంతేగాకుండా అడవులు గ్రామాలకు అత్యంత సమీపంలోనున్న కారణాన, వాటిని ప్రజలే తమ ప్రయోజనం కొరకై సక్రమంగా నిర్వహించు కోగలరు. స్వపరిపాలనా విషయంలో వారిలో శ్రద్ధాసక్తులు, కార్యనిర్వహణ బాధ్యతలు

మున్నగు లక్షణాలు పెంపొందించి ప్రోత్సహించి నట్లవుతుంది అనికూడా భావించ బడింది. ఈ విధానము అప్పటికి సరియైనదేనని అనిపించింది. అయితే ఆశించింత అందకపోగా గ్రామ పంచాయతీల నిర్వహణ లోపంవల్ల ఉన్న అడవులు మటుమాయమైనాయని గత రెండు దశాబ్దాల అనుభవం వల్ల తెలిసింది. అందువల్ల నేరుగా అటవీశాఖ వారే అడవులను సరిచూసుకొంటూ వుండాలని 1948 సంవత్సరంలో ప్రభుత్వం నిర్ణయించింది. ఈ మార్పుతో తగు కట్టుదిట్టములైన చర్యల వల్ల ఈ అడవులు తిరిగి అభివృద్ధి పొందగలవని ఆశింపబడుతున్నది. దురదృష్టవశాత్తు నరకివేయబడిన అటవీ ప్రాంతం కొంత అధికాపహరణోత్పత్తి ఉద్యమం సాకుతో సాగుక్రిందికి తీసుకొని రాబడింది. అట్టి స్థలములలో కొన్నిటికి ప్రభుత్వానుమతి లభించింది. మిగతా వాటికి లేదు. ఇదర్పై అయిదేండ్ల వరకు అడవులను ఇష్టమొచ్చినట్లు వాడుకొని వాటిని సేద్య భూములుగా మార్చుకొన్న యజమానులకు, ఆ భూముల సేద్యం విషయం ఎత్తుతే కోపమొస్తున్నది. పంచాయితీ పరిపాలనా కాలంలో వారు యథేచ్ఛగా కలప, వంటచెరుకు వాడుకొనేవారు. మేకల కొరకు పచ్చికబీళ్లు ఉపయోగించుకొనేవారు. అయితే మాటమానికు మాత్రం ఇట్టిపనులు చేయుడం నిషేధించ బడినవి. ఈ ఇబ్బందులన్నీ అటవీశాఖ ముందుగానే ఊహించింది. 1948 సంవత్సరంలో అడవుల ఇనస్పెక్టర్ జనరల్ శ్రీ హేమిల్టన్ వ్రాసిన పరిశీలనా నివేదికలో ఒక చోట ఇలా పేర్కొన్నారు:-

"ఈ పంచాయతీల అడవులను రక్షించడం ఎంతో అవసరం. స్థానిక ప్రజలు ఇవి అటవీ శాఖ ఆధ్వర్యం క్రిందికి రావడాన్ని ప్రతిఘటించి తీరుతారు. తత్ఫలితంగా స్థానిక చిన్న ఉద్యోగ సిబ్బంది అవినీతిని తొలగొట్ట లేనట్టి స్థితిలో ఇరుక్కొని పోతారు. కనుక ప్రభుత్వ విధానానికి అనుగుణంగా ప్రజాభిప్రాయాన్ని మార్చడం అవసరం. అందుకై ఈ విధానంలో మార్పు తేవడానికి గల కారణాలను ప్రజలకు వివరించేందుకై ప్రభుత్వాధికారులు, అనధికారులు నియోగించబడాలి. సక్రమంగా అభివృద్ధి చెందిన అడవులవల్ల గలిగే లాభాలు ప్రజలకు నచ్చచెప్పాలి. ఈ పద్ధతి అనుసరిస్తే తప్ప, అటవీ శాఖకు పనిచేయల దుస్తరమై పోతుంది".

ఆంధ్రప్రాంతంలోని ఎస్టేటు అడవుల గతి అడగ పనిలేదు. అవి పంచాయతీ అడవులకన్నా అధ్వాన్నమై పోయినాయి. వాటి మాజీ యజమానులు, అధిక ధనలాభాపేక్షతో అడవులన్నిటినీ అనతి కాలంలోనే నిర్మూలం చేసినారు. ఈ అడవులను అటవీశాఖ పరం చేయాలంటే అనేక ఇబ్బందులతో కూడిన పని. అడవుల పరిరక్షణకు ప్రతికూలముగా, రైతులకుగల మామూళ్లు, హక్కులు, సర్వే సెటిల్మెంటుకు రైతు సంఘాలు తెలుపుతున్న ప్రతిఘటన, ఇలాంటి పరిస్థితిలో అపకారం వాదులు లోలోపల కొనసాగిస్తున్న విద్రోహంక చర్యలు ఇంకా ఇతరత్రాగల న్యాయ విషయాలు—ఈ సమస్యలన్నీ అటవీశాఖ ఎదుర్కోవలసి వస్తున్నది. ఎస్టేటు అడవులను స్వాధీన పరచుకోవడంలో మాజీ జమీందారు తన రైతులకు ఇచ్చిన కొన్ని సౌకర్యాలు హక్కులు తగ్గిపోతాయి. తత్పర్యవసానంగా రైతులకు చాల కష్టనష్టాలు కలుగుతాయని చెప్పబడుతున్నది. విచక్షణ లేకుండా ఇలాంటి హక్కులను వినియోగించడం వల్లనే అడవులు జీర్ణావస్థకు తీసుకొని రాబడినాయని వేరే చెప్ప నక్కరలేదు. పరిస్థితులు ఇట్లే కొంత కాలం కొనసాగుతే ఏ ఉద్దేశంతో అయితే అటవీశాఖ అడవులను స్వాధీనం చేసుకో దలచిందో ఆ ఉద్దేశం నిష్ఫలమై పోతుంది. ఇంకో విశేషమేమంటే జమీందారులు రైతులకు ఊరకనే అలాంటి సౌకర్యాలు హక్కులు ఇవ్వలేదు. డబ్బు చెల్లిస్తేనో లేక డబ్బుకు బదులు చాకిరి చేస్తేనో రైతులకు ఈ హక్కులు లభించేవి. మామూళ్ళు, హక్కులు తప్పనిసరిగా మాత్రం వుండేవి కావు.

1950 సంవత్సరము తరువాత తెలంగాణా ప్రాంతంలో అటవీశాఖ స్వాధీన పరచుకొన్న జాగిర్దారీ అడవులు, ఇతర అడవుల పరిస్థితి ఎస్టేటు అడవులకంటె కూడా అధ్వాన్నంగా ఉంది.

జాగీర్దార్ల హయాములో అడవులు విపరీతంగా నరికివేయ బడేవి. అడవులు అటవీశాఖ పరం కాకపూర్వం ఉన్న చెట్లు అన్నీ విక్రయించబడినాయి. ఈ అడవులు పశువుల మేతకు విపరీతంగా ఉపయోగించ బడినవి. గతంలో ఒక పద్ధతి అంటూ లేకుండా అశాస్త్రీయంగా అడవులను నిర్వహించి నందువల్ల చెట్లు చేమలు సహజంగా పుట్టి పెరుగుటకు అవకాశం లేకపోయింది.

## అడవుల అభివృద్ధికై నిరంతర కృషి అవసరం

రాష్ట్రమంతటా రిజర్వు అడవులలో వృక్ష జాలములను పెంచి పోషించుటకు ఎస్టేటు పంచాయతీ జాగీర్దారీ అడవులను పునరుద్ధరించుటకు సత్వరం కృషి సలుపడం ఎంతైనా అవసరం. అయితే అడవుల విషయంలో ఫలితాలు త్వరగా సాధించలేము. అనుకొన్న ఫలితం కలగాలంటే ముప్పై నలభై పండ్లపాటు నిరంతర కృషి చేయాలి. అటవీశాఖ శాస్త్రీయ పద్ధతులపైన కొన్ని పథకాలు తయారు చేసి, బీడుపడిన అడవుల పునరుద్ధరణకు ఒక నిర్దిష్ట కార్యక్రమం రూపొందించి పని అప్పుడే ఆరంభించింది.

భూసారము, వాతావరణము ఇతర పరిస్థితులు అనుకూలంగా ఉన్న చోట్లలో టేకు, చందనము, వేపచెట్లు నాటబడుతున్నవి. నట్టనడి అడవులలో కూడా అనువైనచెట్లు వేయుటకును, అక్కడి నుంచి కలప ఇతర ఆటవిక వస్తుసామగ్రిని ఉపయోగించుకొనుటకు వీలు కలుగుటకును రోడ్లు వేయబడుచున్నవి.

ఆంధ్రలోని పంచాయతీల అడవుల ప్రాంతాలలో భూసారము పెంపొందించుటకు, సమీపంలో నున్న గ్రామస్థులకు వంట చెరుకు, ఆకు ఎరువు, పచ్చిగడ్డి లభింపజేసే ఉద్దేశంతో చాలా చోట్ల క్రొత్తగా అడవులు వేయబడుచున్నవి. ఈ అడవులను వాటి పూర్వస్థాయికి తీసుకొని వచ్చుటకు శాస్త్రీయ పద్ధతులపై కార్యాచరణ పథకములు రూపొందించబడుతున్నవి. ప్రస్తుతం పంచాయితీ అడవులు పతనావస్థలో నున్నందున చాలా కాలం వరకు వాటి జోలికి పోకూడదు. వాటిని ఉపయోగించుకోవడం కూడా ఒక క్రమపద్ధతిన జరగాలి. ఈ విధానం గ్రామస్థుల అత్యవసరాలకు ప్రతిబంధకముగా నున్నది. ఈ సుదీర్ఘ కాలపథకాన్ని దృష్టిలో ఉంచుకొని, గ్రామస్థులు కొంత ఇబ్బందిని ఎదుర్కోవడానికి సిద్ధపడితే తప్ప, మనకృషికి తగిన ఫలితం లభించదు. ఆంధ్రలోని ఎస్టేటు అడవులు, తెలంగాణాలోని జాగీర్దారీ అడవులను ఇంచుమించు నిర్మూలమయ్యేంతవరకు ఉపయోగించుకొనినందువల్ల, చెట్లుపుట్టి పెరిగేచానికి ఆస్కారంలేకుండా పోయింది. మేకలు అడవులలో బాగా మేతమేశాయి. మేకలు అడవుల ఉనికికి శత్రువులు. అగ్నికి వాయువుతోడన్నట్లు, అడవుల సమీపంలో నివసిస్తూ ఉన్న గ్రామస్థులు కూడా కొన్ని సౌకర్యాలు, హక్కులు కోరడం మొదలు పెట్టారు. ఒకతట్టు మేకలు మేస్తుంటే, మరోతట్టు 'పోడు' -ఆంధ్రలో- సేద్యం ఆరంభించేప్పటికి అటవీ సంరక్షణ అడుగంటి పోయింది. ఏజెన్సీ ప్రాంతంలో, ఇతర ప్రాంతాల్లో గిరిజనులు, అడవుల సమీపంలో నివసించు ఇతర ప్రజలు "పోడు" సేద్యాన్ని ఆరంభించారు. పోడు సేద్యం అంటే ఉన్న భూములను సారహీనములైతే వాటిని విడిచి పెట్టి కొత్త భూములలో సేద్యం చేయడం అన్నమాట. అడవులను నరికి, వాటిని పూర్తిగా కాల్చివేసి ఆ భూములలో ఒకటి రెండు సంవత్సరాలు సేద్యం చేసిన తరువాత తిరిగి కొత్త అడవి ప్రాంతాన్ని అదే పద్ధతిన సాగులోకి తెస్తారు. అడవులలో ముఖ్యంగా ఏటవాలు ప్రాంతాలలో చెట్లు చేమలు లేకుండా చేస్తే, ఆ భూములేగాక వాటికి దిగువ భాగంలో వుండే భూములు కూడా వర్షాలకు వొరుసుకొని పోయి, సారహీనములై పోతాయి. సరిగా అడవులు లేక పోతే భూమిలోపలి నీటిమట్టం మరీ లోపలికి పోతుంది. ఏడాది పొడుగునా ప్రవహించే సెలయేళ్లు యెండిపోతాయి. ఇలాంటి పరిస్థితులుంటే ఏ రిజర్వాయరు గానీ డాం గానీ 50 ఏండ్లకంటే యెక్కువకాలం మనజాలదు. కర్నూలు జిల్లాలో కంభం చెరువులో అతి త్వరగా బురద పేరుకొంటున్నదని గ్రామస్తులందరూ భయాందోళనలు

ప్రకటిస్తున్నారు. అడవులు నరకి వేయడమే యీ పరిస్థితికి కారణం.

అటవీశాఖ కైవసం చేసుకొన్న కొన్ని ఎస్టేటు అడవులలో మేకలు మేయడం నిషేధించ బడింది. అయితే స్థానిక ప్రజలు అందుకు వ్యతిరేకంగా చాలా ఆందోళన కొనసాగిస్తున్నారు. మేకలుంటే అడవులుండవనేది స్పష్టం. సైప్రసు దీవిలోను, పాలస్తీనా దేశంలోను అడవులు మేకల దాడికి గురియై కాలక్రమేణా యెడారి ప్రాంతాలుగా మారి పోయిన సంగతి మనం గుర్తుంచుకోవాలి. అనేక పాశ్చాత్య దేశాలలో మేకలేగాక పశువులు కూడా అడవులలో మేత మేయుటకు నిషేధ మున్నది. మన అటవీ శాఖ అధికారులలో నొకరు 1955 సంవత్సరంలో అమెరికాకు శిక్షణకొరకై వెళ్లారు. ఆ దేశంలో రిజర్వు అడవులలో ఏలాంటి పశువులు కూడా మేత మేయుటకు వీలు లేదని ఆయన చూచి చెప్పారు.

## అడవి భూములలో సేద్యం

అటవీ ప్రాంతాన్ని సేద్య భూములుగా మార్చి వేస్తున్నందువల్ల అటవీ సంపద పరిరక్షణకొక విఘాతం కలుగుతున్నది. గత యుద్ధకాలంలో - అధికాహారోత్పత్తి పథకం క్రింద ఆహారోత్పత్తిని ప్రోత్సహించే ఉద్దేశంతో పంచాయతీ, రిజర్వు అడవులలో కొన్ని భూములు సేద్యం కొరకు కౌలుకివ్వబడినవి. కొంతమంది అనుమతి లేకుండానే ఆడవి భూములను సేద్యం చేయనారంభించారు. ఇప్పుడు పంచాయతీ అడవుల అభివృద్ధికై వాటిని ప్రభుత్వం స్వాధీనం చేసుకొన్న తరువాత, తాము అక్రమంగా సాగుచేస్తున్న భూములు విడిచి పెట్టుటకు రైతులు నిరాకరిస్తున్నారు. న్యాయరీత్యా వీరికి భూములపైన ఏలాంటి హక్కు లేదు. అయితే వారికి ఇబ్బంది లేకుండా చేసే ఉద్దేశంతో "కుమ్రీ" సేద్యం చేసుకొనుటకు అనుమతి ఇవ్వబడింది. భూములలో చెట్లను పెంచుతూ ఆహార ధాన్యములు పండించే సేద్యాన్ని కుమ్రీ సేద్యమంటారు. ఈ పద్ధతికింద మద్రాసు రాష్ట్రంలో నిలంబూరు వైయ్యనాడు కోయంబత్తూరు అడవుల భూములలో టేకు చెట్లు వేయబడుతున్నవి. ఆంధ్ర ప్రదేశ్‌లో ఇది సాధ్యం కాదు. కారణమేమంటే ప్రజా సహకారం లభించక పోవడమే. సువిశాల భూములను హస్తగతం చేసుకొన్న ప్రజలు చెట్లు నాటక పోవడమట్లుంచి, ఆ భూములను రిజర్వులో చుంచకూడదని, పట్టాలివ్వాలని డిమాండు చేస్తున్నారు. అనేక సందర్భాలలో వీటివెనక స్థానిక నాయకులున్నారు. తత్ఫలితంగా ప్రభుత్వం ఇరకాటంలో పడిపోతున్నది. మనకున్న అడవులు నిర్ణీత ప్రమాణానికి చాల తక్కువగా వున్నాయి. అందువల్ల అటవీ ప్రాంతాలను ఎక్కువ చేయాలి కాని వాటినుంచి భూములను సేద్యానికి ఉపయోగించకూడదు. ప్రభుత్వ అటవీ విధానంతో సహకరిస్తూ ప్రజలను సక్రమమైన మార్గంలో నడిపించ వలసినదని ప్రజానాయకులను, రాజకీయ వేత్తలకు విజ్ఞప్తి చేయడమవుతున్నది. ఈ సందర్భంలో రెవరెండ్ యఫ్. కోర్నర్ సంఘులి రోటరీ క్లబ్బులో నుడివిన మాటలను ఇక్కడ పేర్కొనడం సముచితంగా వుంటుంది.

"అడవులను పెంచి పోషించడం దేశభక్తిని వెల్లడిస్తుంది. భారత దేశంలో దీనికి ప్రముఖ స్థానమివ్వాలి. 365 రోజులలో ఒకరోజును అడవుల పోషక దినంగా ఎన్నుకొందాం. ఆ దినాన్ని గొప్ప పండుగ దినంగా జరుపుకొందాం. ఈ పండుగను ఎంత వేడుకగా పట్టుదలతో జరుపుకోవాలంటే భూమిలేని పేదరైతు కోరినాగానీ, రాజకీయవేత్త వాగ్దానం చేసినా గానీ అడవులను తగ్గించాలనే కోరికకు తలొగ్గకూడదు. వాస్తవంగా అడవులను అభివృద్ధి పరచితే తప్ప, ఏదో కొంత భూమి ఇచ్చినంత మాత్రాన పంటలు ఫలితాన్ని ఇవ్వవు. చాలా భూమి సేద్యం క్రిందికి పోతున్నది. అయితే ఫలితం స్వల్పం. ఇందువల్ల కలిగే నష్టం మాత్రం చాలా విపరీతంగావుంటున్నది. ఎంత భూమి సేద్యానికి వాడుకోవాలో తెలుసుకోక పోవడం ప్రమాద కరం."

ఈ యన చెప్పినమాటలు మన ఆంధ్రప్రదేశ్ విషయంలో అక్షరాల నిజమైనాయి.

## చెట్టు ఒక ఫ్యాక్టరీ వంటిది

శాసనాలు తయారుచేయడం కంటె ప్రజా సహకారం లభిస్తే అడవులకు చాలా లాభం కలుగుతుంది. ఈ విషయంలో విశేష ప్రచారం కొనసాగించడం అవసరం. వనమహోత్సవం మన భారత దేశంలో ఒక జాతీయ పర్వదినంగా పరిఢవిల్లింది. వన మహోత్సవ కాలంలో ఒక మొక్క ఇక్కడా ఒక చెట్టు అక్కడా నాటినంత మాత్రాన సరిపోదు. వన మహోత్సవం జరుపడంలో గల ఆశయం అది కాదు. ప్రజలు వన దేవతను పూజించునట్లు చేయడమే ఈ వనమహోత్సవ ఉద్దేశం. మొక్కలు నాటిన తరువాత వాటిని పెంచి పోషించడం ఎంతో ముఖ్యం. సమిష్టి కృషివల్ల ఎంతో లాభం చేకూరుతుంది. ఒక గ్రామానికీ మరొక గ్రామానికీ మధ్యగల పడావా భూములలో గ్రామ అడవులను పెంచాలి. ఈ విషయాన్నే మనగవర్నరు 1955 లో కోయంబత్తూరు ఫారెస్టు కాలేజీ స్నాతకోత్సవ సందర్భంలో ఉద్ఘాటించారు. ఈ విషయంలో అటవీ శాఖ తగు సహాయం చేస్తుంది. అయితే ప్రజా సహకారం లభించడంలేదు. జాతీయ వికాస కేంద్రాలలోనూ, కమ్యూనిటీ ప్రాజెక్టు ప్రాంతాల లోను గ్రామస్థులు ఆర్థిక సహాయం చేయడానికి గాని, కాయకష్టం చేయడానికి గాని పూర్తిగా నిరాకరించారు. ఇంతకంటే ఘోరమైన విషయ మేమంటే కొన్ని ప్రాంతాలలో గ్రామస్థులు కావాలని చెట్లకు నష్టం కల్గించడంవల్ల ప్రభుత్వ ధనాన్ని ఖర్చుపెట్టి అటవీ శాఖచేసిన కొద్దిపాటి పని వృథాఅయి పోయింది. ఈ నేరస్థులు చేసిన పని సరియైనదేనని వాదించే నాయకులవల్ల ఇంతకంటె యెక్కువ నష్టం కలుగుతున్నది. ఇలాంటి పరిస్థితి చాలా నిరుత్సాహ జనకంగా వుంది. అయితే త్వరలోనే మంచి మార్పు రాగలదని ఆశింపబడుతున్నది.

రెవరెండ్ యఫ్. కోర్నర్ సంఘలి రోటరీ క్లబ్బులో అన్న ఈ మాటలు జ్ఞాపక ముంచుకోవడం మంచిది.

> "చెట్టంటే దేవళంకాదు. అది ఒక కర్మాగారం. ఇది భూమిని సారవంతం చేస్తుంది. చెట్టు వ్యవసాయానికి ముఖ్యం. మన నీటి వనరులు డాంలను అభివృద్ధి పరచ గలదు. లేదా ఉపేక్షించి నట్లయితే వాటిని వినాశం చేయగలదు. అడవులున్నట్లయితే కష్ట నష్టాలను కలిగించే నదిని అవి సిరిసంపద లిచ్చే నదిగా మార్చ గలవు."

గ్రామస్థులు గ్రామ అడవులు వేసినట్లయితే వంట చెఱకు, పశువులకు మేత, ఆకు ఎరువు, పచ్చి గడ్డి సంబంధించినంతవరకు స్వయం సమృద్ధి కలిగి యుంటారు. చింతచెట్లు, మామిడి, జీడి మున్నగు చెట్లు వేసి అడవులను ఇంకా అభివృద్ధిలోకి తేవచ్చు. ప్రస్తుతం దేశానికి అవసరమైనది 'అధికముగా వంట చెఱకు ఉత్పత్తి చేయుండి' అనే విధానము గాని 'అధికాహారోత్పత్తి' కాదని గ్రామస్థులందరూ తెలుసు కోవాలి. ఎక్కువ భూమిని సాగు క్రిందికి తెచ్చే బదులు ఉన్న భూమినే చక్కబరచుకొంటే వ్యవసాయం అభివృద్ధి చెందుతుంది. "పోడు" సేద్యానికి బదులు "కుమ్రి" సేద్యం చేయడం మంచిది. ఈ పద్ధతి మద్రాసు రాష్ట్రంలోను, ఉత్తర ప్రదేశ్ లోని సహరాన పూరులోను అమల్లో వున్నది. అడవి భూములను సాగు క్రిందికి తేవడం బంగారు గుడ్లు పెట్టే బాతును దురాశతో చంపుకొన్నట్లవుతుంది.

పంచాయతీ, ఎస్టేటు, జాగీర్దారీ అడవుల ఉత్పత్తి శక్తిని త్వరితంగా హెచ్చించుటకు శాస్త్రీయ పద్ధతులపైన కృషి జరుగుతున్నది. ఇదివరకున్న సౌకర్యాలు, మామూళ్లు, హక్కులు ఇక మీదట కూడా కొనసాగాలని ప్రజలు పట్టుబడితే అటవీ శాఖ ఆ అడవులను స్వాధీనం చేసుకోవడంలో అర్థం లేదు. వీటిపైన ప్రజాధనం వెచ్చించడం వృథా అవుతుంది.

ప్రథమ పంచవర్ష ప్రణాళికలో సాధించిన ప్రగతి వివరాలు ఇవి :-

## అ. ఆంధ్రప్రాంతం

1 200 చ.మై. వైశాల్యంగల పంచాయతీఅడవులు స్వాధీన పరచుకో బడినవి.

2 పెన్నానది ఒడ్డున, ఇసుక కొట్టుకొని పోకుండా చేయుటకై 315 ఎకరాలలో చెట్లు వెయ బడినవి.

3 కోస్తా జిల్లాల్లో 1,509 ఎకరాలలో సర్వీచెట్లు వేయబడినవి.

4 అడవులను ఒక క్రమ పద్ధతిలో నిర్వహించుటకై 8 ఫారెస్టు డివిజనులకు కార్యాచరణ పథక ములు తయారు చేయబడినవి.

5 కర్నూలు జిల్లాలోని నల్లమల అడవులలో 23 మైళ్ల 2 ఫర్లాంగుల మేరకు రోడ్లు వేయబడినవి.

6 16,860 ఎకరాలలో వంట చెఱకుకు, మేత వగైరాలకు ఉపయోగపడే అనేక రకాలచెట్లు వేయబడినవి.

## ఆ. తెలంగాణా ప్రాంతం

1 24,311 ఎకరాలలో అడవులు వేయబడినవి. ఇందుకు అవసరమైన చోట్లలో భూములు స్వాధీన పరచుకోబడినవి.

2 సాహెబ్ నగరులో భూసార రక్షణ పరిశోధనా కేంద్రం స్థాపించ బడింది.

3 అడవుల పెంపకపు కార్యక్రమం ప్రకారం 38 నర్సరీ యూనిట్లు నెలకొల్ప బడినవి.

4 ఈ పథకములను అమలు జరుపుటకు వలసిన యంత్ర పరికరములు, చెట్లు మొక్కలు కొను క్కోవడం జరిగింది. రెండు మోటారు సైకిళ్లు ఒక ఆయిల్ ఇంజను, నీటి పంపు కూడా కొనుక్కోబడినవి.

5 సిల్వీకల్చరల్ రీసెర్చి బ్రాంచి, చీఫ్ కన్సర్వేటర్ ఆఫీసులో అక్కౌంట్స్ బ్రాంచి తెరువబడినవి. పథకములను అమలు జరుపుటకు ఉద్యోగ సిబ్బందికూడా నియమించ బడింది.

ముందు చేయవలసిన పని ఇంకా యెంతో వుంది. అటవీశాఖ సదా నిర్వహించు విధులు దిగువ పేర్కొన బడినవి:-

1 తమ అధీనంలోవున్న అటవీ ప్రాంతాలన్నిటిని కాపాడుట.

2 రిజర్వు అడవులను అభివృద్ధి పరచుట, ఇదివరకు పంచాయతీ, జమీందార్ల క్రిందవున్న అడవులను పునరుద్ధరించుట.

3 ఉత్తరోత్తరా అడవులనుంచి నిరంతరము వస్తువులు సరఫరా అగుటకు వీలగునట్లు ఇప్పటి నుంచి అడవులను ఒక పథకం ప్రకారం అభివృద్ధి పరచుట.

4 గ్రామ అడవులను పెంచుట. గ్రామాలకు సమీపంలో, గ్రామస్థులకు అవసరమైన వంట చెరుకు. ఆకు ఎరువు మున్నగునవి లభించుటకు వీలగునట్లు చెట్లు వేయుట. దానివల్ల అడవుల పైన కొంతభారం తగ్గి అవి సంరక్షింప బడుతాయి. శీతోష్ణస్థితిలో ఒడుదుడుకులుండవు. వర్షపు నీరు భూమిలో నిలవ వుంటుంది. అందు వల్ల సెలయేళ్లు, పెద్ద నదులు సజీవమైపోతాయి. అంతేగాక కలప, చిన్న అడవుల వస్తుసామగ్రి మనకు లభించుటకు వీలుంటుంది.

5 పై ఆశయాలను అమలు జరుపుటకు ఉద్యోగు లకు శిక్షణ ఇచ్చుట.

రెండవ పంచవర్ష ప్రణాళికలో అటవీశాఖ తల పెట్టిన పథకముల వివరాలు ఇవి:-

## ఆంధ్ర ప్రాంతం

1 ఎనిమిది ఫారెస్టు డివిజనుల కొరకై తయారు చేయబడిన కార్యాచరణ పథకములను పరిస్థితుల కనుగుణముగా సవరించుట.

2 నదీతీరములలో 544 ఎకరాల భూమిని స్వాధీన పరచుకొని అందులో చెట్లు వేయుట.

3 3,180 ఎకరాలలో సర్వీచెట్లు వేయుట.

4 17,450 ఎకరాలను ప్లాట్లుగా చేసి వాటిలో చెట్లు నాటుట.

5 వరదలకు భూమి కోసుకొని పోయిన కుట్టల పటువాలు ప్రాంతాలలో 775 ఎకరాలలో అడవులను పెంచుట.

6 మైదానాలలో అడవి రోడ్లను 399 మైళ్లవరకు ఏజెన్సీ ప్రాంతాలలో 286 మైళ్లవరకు అభివృద్ధి పరచుట.

7 వెదురు బొంగుల శిక్షణ కేంద్రము, లక్క పరిశ్రమల కేంద్రము తెరుచుట.

8 తక్కువ ఆదాయం గల ఉద్యోగ సిబ్బందికి ఏజన్సీ ప్రాంతాలలో 85 ఇండ్లు నిర్మించుట.

9 చిత్తూరు జిల్లాలోని మామండూరు లోయలో వేట స్థలాలు ఏర్పాటు చేయుట.

10 జిల్లా అటవీ శాఖ అధికారుల ఉపయోగార్థమై 6 జీపు కార్లను కొనుట.

11 రిజర్వు అడవులకు బయట భూమి కోసుకొని పోయిన కొండల ఘటవాలు ప్రాంతాలలో 1,330 ఎకరాలలో అడవులు పెంచుట.

## తెలంగాణా ప్రాంతం

1 అటవీ పరిశోధన, ప్రచార కార్యక్రమాలు కొనసాగించుట.

2 సాహెబ్ నగరులో భూసార రక్షణ పరిశోధన కేంద్ర నిర్వహణ.

3 17,750 ఎకరాలలో వరద కట్టలు వేసి, అడవులు పెంచుట.

4 20,000 ఎకరాల మేరకు ప్రయివేటు భూములు స్వాధీన పరచుకొనుట.

5 800 మణుగుల లక్కను తయారు చేయుట.

6 2,500 ఎకరాలలో కలప లభించు అడవులలో చెట్లను అభివృద్ధి పరచుట.

7 అడవుల పెంపకం కార్యక్రమం క్రింద 4 నర్సరీ యూనిట్లు, అడవుల అభివృద్ధి కార్యక్రమం క్రింద 20 నర్సరీ యూనిట్లు నెలకొల్పుట.

8 250 ఎకరాలలో అగ్గిపుల్లలకు పనికివచ్చు చెట్లు వేయుట.

9 అటవీ ప్రాంతంలో 23 భవనములు నిర్మించుట.

10 80 మైళ్ల మేరకు రోడ్లు నిర్మించుట.

11 ఒక జీపు కారును కొనుట.

12 కొత్తగా ఒక వేటస్థలాన్ని తెరచి, 3 వేట స్థలాలను నిర్వహించుట.

13 1,600 ఎకరాలలో జీడి చెట్లను వేయుట.

పైన పేర్కొనబడిన పథకములన్నిటినీ విజయవంతంగా అమలు జరుపాలంటే గ్రామీణ ప్రజలు, వారి నాయకుల సహకారం లభించడం చాలా అవసరం. అటవీ విధానానికి ప్రజాభిప్రాయాన్ని అనుకూలంగా మార్చుటకై ప్రభుత్వం స్థానిక ప్రజలపైన శాసన సభ్యులపైన ఆధారపడియున్నది.

అఖిలభారత స్థాయి పైన, రాష్ట్ర స్థాయిపైన భూసార రక్షణ సంఘం, అడవిమృగాల రక్షణకై సలహా సంఘం, ఆటవిక వస్తువుల వినిమయమునకై సలహా సంఘం మున్నగు వాటిని ఏర్పాటు చేయడంతో మన జాతీయ అటవీ విధానాన్ని విజయవంతంగా అమలు పరచుటకు మార్గం వేయబడింది. ఈ కార్యక్రమమంతా ద్వితీయ పంచవర్ష ప్రణాళికానుసారం కొనసాగించ బడుతుంది. సర్వకాల సర్వావస్థలయందు 'కామధేనువు' వలె మనకు సహాయ పడుతున్న అడవులను కాపాడడంలో ప్రజాసహకారం లభించగలదని ఆశింపబడుతున్నది.

అమెరికాలోని భూసార రక్షణకై కృషిచేస్తున్న డా. లౌడెర్ మిల్క్ చెప్పిన మాటలను యీ సందర్భంలో మనమందరం గుర్తుంచుకోవాలి:—

"భూమాతకు నీవు వారసుడవు. నమ్మిన బంటుగా కర్తవ్యాన్ని పాలిస్తూ భూమియొక్క ఉత్పత్తి శక్తిస్తోమతలు హరించి పోకుండా నీవు తగు శ్రద్ధవహించాలి.

"వరదలకు భూసారము కొట్టుకొని పోకుండాను, జీవనదులు ఎండి పోకుండాను అడవులు నిర్మూలం కాకుండాను, పశువులు కొండ చరియలలో అధికముగా మేతమేయు కుండునట్లును, నీవు తగు రక్షణ చర్యలు గైకొన్నట్లయితేనే నీ పుత్ర పౌత్రాదులకు సిరిసంపదలు అందించిన వాడవౌతావు.

"భూమిని కాపాడుటలో ఎవరైనా కర్తవ్యాన్ని పాలించక పోయినట్లయితే, సస్యశ్యామలమైన భూములు సారహీనమై, రాళ్లు, రప్పలకు నిలయము లౌతాయి. తత్ఫలితంగా భావి సంతతి వారు క్షీణించి దరిద్ర జీవితము గడుపుతూ నశించి పోతారు."



ఐదవ అఖిలభారత చేనేత వారోత్సవాలు :

# మగ్గంమీద మంచిగుడ్డ నేయటం సాధ్యమా ?

శ్రీ యం. యస్. యు. కురూప్, డిజైన్ కేంద్రం,
ఆలిండియా హేండ్‌లూమ్ బోర్డు

మగ్గం మీద మంచి గుడ్డ నేయటం సాధ్యమేనా అనే ప్రశ్నకు, కొన్ని అధునాతన విధానాలను అనుసరిస్తూ, మగ్గమును సక్రమంగా వినియోగించు కుంటే, సాధ్యమనే సమాధానం చెప్పాలి. యిటీవలి సంవత్సరాలలో యీ పని ఏ విధంగా సాధించబడిందో గమనించటం వినియోగదారులకు ఆసక్తి జనకమైన విషయమే.

*1.* **సమత :** గుడ్డలు అమ్మేవాడు వచ్చి, ఒక గుడ్డ మడత విప్పి మన ఎదుట ప్రదర్శించినప్పుడు, కొన్ని కొన్ని సందర్భాలలో ఒకచోటఉన్న నేత మరొకచోట లేకుండుట మనం గమనిస్తుంటాం. నేత అన్నిచోట్ల సమంగా లేకుంటే అది నాణ్యమైనగుడ్డ కాజాలదు. తగిన పనిముట్లతో గనుక పరిశీలిస్తే, ఒక గుడ్డలోని ప్రతి అంగుళం మేరలోనూ, నిలువునగానీ, అడ్డంగాగానీ, సమాన సంఖ్య గల నూలు దారాలుంటే అది నాణ్యమైనగుడ్డ అని చెప్పవచ్చు. ఉదాహరణకు మనం వాడే మేలురకం ధోవతిలో 50 అంగుళాల మేరలో మూడు వేల దారాలు వుంటాయి. అంటే ప్రతి అంగుళంలోనూ 60 దారాలు వుండాలన్నమాట.

మగ్గంలో "రీడ్" అనేపేరుగల ఒక సాధనం ద్వారా గుడ్డ వెడల్పు ప్రతి అంగుళం మేరలో యెన్ని దారాలు ఉండాలో నిర్ణయించబడుతుంది. ఉక్కు లేక యిత్తడితో చేసిన లోహపు రీడ్లు ఉత్తమమైనట్టివి, అధునాతనమైన మర మగ్గాలలో కూడా ఉపయోగించబడుతున్నవి యివే. చాలా మంది అభ్యుదయకాములైన చేనేత పారిశ్రామికులు సరిగ్గా యిటువంటి స్టాండర్డు రీడ్లను వినియోగిస్తున్నారు. ధనాభావం వల్ల కొందరు వెదురుతో చేసిన రీడ్లు ఉపయోగిస్తారు. అట్టి వారికి సహాయము చేయుటకై మేలురకం రీడ్లను సహకార సంఘాలద్వారా ఉచితంగా అఖిలభారత చేనేత బోర్డు వారు సప్లై చేస్తున్నారు. ఈ విధంగా అనేక వేల రీడ్లు చేనేత పారిశ్రామికులకు సప్లై చేయబడినవి. అందువల్ల అనేక మగ్గాల మీద గుడ్డనేతలో సమత సాధించటానికి అవకాశం ఏర్పడింది. నిలువున చూసినప్పటికీ, ప్రతి అంగుళం మేరలో సమాన సంఖ్యగల పోగులు వుండటం అవసరం. నిపుణులైన చేనేత పారిశ్రామికులందరూ యీ విషయంలో సమర్థంగా పనిచేసి సమతను సాధించగలరు. అయిని యిందులో కూడా 100 పోగులకు సుమారు 3 పోగుల తేడా వుంటుంది. ఈ వ్యత్యాసం అంతగా పరిగణించదగినది కాదు. పైకి యీ వ్యత్యాసం అంత స్పష్టంగా కన్పించదు. అంతేకాక దీనివల్ల గుడ్డ నాణ్యముకూడా ఏమంత తగ్గదు. ఏమైనప్పటికీ యీ విషయంలో గట్టి పట్టుదలతో స్థిరత్వాన్ని సాధించటమే మంచిది. యితర దేశాలలోని చేనేత

వస్త్ర వినియోగదారులు తరచుగా యీ వ్యత్యాసమును గూడా తొలగించు కోవలసిందని సలహా యిస్తుంటారు. అందువల్ల మరమగ్గంలో అడ్డపోగులను నిర్ణయించి, క్రమపరచుచున్న యంత్రాంగమే, చేనేతలోగూడా వినియోగించ బడుతున్నది. ఈ పద్ధతి పేరు "టేక్ అప్ మోషన్ అటాచ్ మెంట్". దీనికి కావలసిన పరికరాలకు సుమారు సగటున రూ. 0 లు అవుతుంది మన దేశంలోని వేలాది మంది నేత కార్మికులకు, అఖిలభారత చేనేత బోర్డు వారు యీ పరికరాలను ఉచితంగా లభింప జేశారు. ఈ విధంగా చేనేత వస్త్రాలలో స్టాండర్డు రీడ్ల ద్వారానూ, టేక్ అప్ మోషన్ అటాచిమెంటు విధానం ద్వారానూ సమత సాధించ బడుతున్నది

***2. అడ్డబార్లు :-*** గుడ్డలో ఎక్కడైనా ఒకచోట 3 లేక 4 అడ్డపోగులు లేకపోతే, అది మంచిగుడ్డ కాదు. మరమగ్గంలో నైతే యీ విధమైన లోపాలను నివారించటానికి కొన్ని తమంతటతాము పని చేసే సాధనాలు అమర్చబడి వున్నవి. కాని యీ సాధనాలను సక్రమంగా అమర్చి పెట్టుకోకపోతే, నేత నేస్తున్నప్పుడు క్షణంలో యిట్టిలోపాలు, సందులు ఏర్పడటానికి వీలున్నది. ఎందుకంటే, మరమగ్గంలో షటిల్ ఒక మోటారుకారు అంత వేగంతో అటూ యిటూ తిరుగుతుంటుంది చేనేత పారిశ్రామికుడైతే షటిల్ ను చేత్తోనే అటూయిటూ త్రిప్పుతుంటాడు. అందువల్ల ఎల్లప్పుడు నేతనేయు కార్మికుడు ఎక్కడ నేత జరుగుతున్నదో అక్కడే దృష్టి కేంద్రీకరించి పని చేయవలసి వుంటుంది. అందువల్ల పొరపాటులు రావటానికి అంతగా వీలుండదు. వాటిని సులభంగా నివారించుకోవచ్చు.

***3. తెగినపోగులు :-*** మరమగ్గంలో నేత జరుగు తున్నప్పుడు, కొన్ని కొన్ని సమయాలలో నిలువు పోగులు తెగుతూ వుంటవి. ఆ విధంగా తెగిన దారాన్ని సర్దుకోకుండా ఒక అంగుళం దూరం నేత జరిగిపోతే, అంగీకృత ప్రమాణులను బట్టి ఆ గుడ్డ లోపభూయిష్టమని చెప్పవలసి వస్తుంది. మరమగ్గంలో ఒక అంగుళంమేర నేతపని జరగటానికి 20 సెకండ్ల కాలం మాత్రమే పడుతుంది. మగ్గము ను నడిపేవాడు సావధానుడై ఉండకపోతే యిటువంటి పొరపాట్లు, లోపాలు చాలా త్వరగా కలగటానికి అవకాశం వుంటుంది. చేనేతలోనైతే, ఒక అంగుళం గుడ్డ నేయటానికి రెండు, మూడు నిమిషాలకాలం పడుతుంది. నేత జరుగు తున్నంత సేపు, నేత కార్మికుడు గుడ్డను చూస్తూ ఎదురుగానే కూచొని వుంటాడు కూడా. అందువల్ల అంగుళం దూరం నేత జరక్కముందే అతడు పోగు తెగిందని కనుక్కో గలుగుతాడు. అంతేకాదు అతినిపుణులైన చేనేత కార్మికులు పోగు తెగిన విషయమును, కాలు ఆడించిన మరుక్షణంలోనే గ్రహించ గలుగుతారు. నిలువుపోగు తెగిన వెంటనే తమంతట తాము నిలిచిపోయే మరమగ్గాలు ... లేకపోలేదు. కాని మన దేశంలో గల అటువంటి యంత్రాల శాతం బహు స్వల్పం.

***4. అంచులు:-*** చేనేత వస్త్రాల అంచులు, మిల్లు వస్త్రాల అంచులవలె కాకుండా, అదొక రకమైన అందాన్ని స్ఫురింప జేసేవిగా వుంటాయి. మద్రాసు చేతిరుమాళ్ళవంటి వాటికి అంతర్జాతీయ ప్రతిష్ట లభించటానికి ప్రధానంగా యీ అంచుల అందమే హేతువు. యింకా చేనేతకు ప్రత్యేకమైన కొన్ని లక్షణాలు వున్నా యీ అంచులతీరు ప్రధానమైనట్టిది. మిల్లు వస్త్రాల్లోల్లాగా సూటి అయిన అంచులను సాధించటానికి కూడా చేనేతలో అవకాశం వుంది. రెండు "టెంపిల్స్" ను ఏర్పాటు చేయుటంద్వారా అది సాధించవచ్చు. లోగడ పేర్కొన్న "టేకప్ మోషన్" పద్ధతిలో ఒక భాగంగానే యీ ఏర్పాటు చేయవచ్చు.

***5. గుడ్డ నున్నితం, మెరుపు:-*** బ్లీచింగ్, మెర్సిరైజింగ్, శాన్ ఫొరైజింగ్, కేలండరింగ్ వగైరా వివిధ పద్ధతులకు లోనైన యడల, మిల్లు గుడ్డ వలెనే చేనేత వస్త్రాలకుకూడా మెరుపు, నిగనిగలాడటం మొదలైన లక్షణాలు చేకూర గలవు. శాస్త్రీయంగా ప్రయోగాలు చేసి చూడటంద్వారా యీ విషయం ఋజువైందికూడా. కాని వినియోగదారు సామాన్యంగా యీ విషయాలను బట్టి గుడ్డ నాణ్యం నిర్ణయించటంలేదు. అతడు ఎక్కువగా గుడ్డ చూపరిగా వున్నదా లేదా, చేత్తో పట్టుకుంటే నేత బాగున్నదాలేదా అనే విషయాలే ముఖ్యంగా

చూస్తున్నాడు. యిటీవలనే ఒక పెద్ద చేనేత పారిశ్రామిక సహకార సంఘంవారు యీ విషయంలో పరిశోధన జరిపించారు. మేలురకంలో బూడిదరంగు గుడ్డను యీ సంఘంవారు తయారు చేసి, దానిని ప్రాసెస్ చేసి, దానినుండి మిల్లులలో తయారయ్యేటటువంటి మల్లు గుడ్డగా తయారు చేశారు. వివిధ ఆదాయ పరిమితులకు సంబంధించిన వినియోగదార్ల వద్దనుండి దీనిని గురించి అభిప్రాయాలు సేకరించబడినవి వారి లెక్కల ననుసరించి వినియోగ దార్లలో నూటికి 98.5 మ ది మిల్లు మల్లుకూ, చేనేతమల్లుకూ మధ్య తేడా కనుక్కోలేక పోయినట్లుగా రూఢి అయింది.

చేనేత వస్త్రాలంటే నిర్లక్ష్యం, ద్వేషం ఏమైనా వుంటే, వాటిని తొలగించుకొని, ఫలానా మిల్లు గుడ్డ, ఫలానా రకం కొనటానికి మాత్రమే చాలా కాలంనుండి చేసుకొన్న అలవాటును అవతలపెట్టి పరిశీలిస్తే, మిల్లుగుడ్డవంటి సలక్షణమైన రకాల గుడ్డలు చేనేతలోగూడా దొరకగలవని ఏవినియోగదారుడైనా గ్రహించ గలడు. చేనేత వస్త్ర పరిశ్రమ దినదినాభివృద్ధి నందుతున్న యీతరుణంలో నాణ్యమైన చేనేత గుడ్డను ఖరీదుచేసి, పెట్టిన పెట్టుబడిని మించిన లాభం పొందవచ్చు. తరతరాలుగా మనకు సంక్రమించిన కళా సంపదను తనలో యిముడ్చుకోగలిగిన చేనేత పరిశ్రమతద్వారా మనకు సంతృప్తి దాయకమైన అధిక లాభాన్ని చేకూర్చ గలుగుతుంది.



# అభివృద్ధి కార్యక్రమ కేంద్రాల విశేషాలు

### నాగార్జునసాగర్ ప్రేక్షకులు

**1957** డిసెంబరు నెలలో నాగార్జునసాగర్ ఆనకట్టను సందర్శించడానికి అన్నిరంగాలకి చెందిన వారు ముత్తం వెయ్యిమందికిపైగా వచ్చారు. వారిలో ప్రముఖులైన విదేశీయులుకూడా వున్నారు. కృష్ణానదిపై నిర్మితమైన రోడ్డువంతెనను 1957 నవంబరు 28 వ తేదీన ముఖ్యమంత్రి శ్రీ ఎన్. సంజీవ రెడ్డి ప్రజల రాకపోకలకి తెరిచారు. అందువల్ల యిప్పుడు ఆనదికి యిరుప్రక్కలనుంచీ చక్కని ప్రయాణ సౌకర్యాలు యేర్పడినవి. ప్రయాణం యెక్కువ సురక్షితంగా, శీఘ్రంగా జరిగే అవకాశం యేర్పడింది. పునాదులపై ఆనకట్ట నిర్మాణంసాగి, దాని యెత్తుపెరుగుతున్నది. దానా, దీనా పై నెలలో యీ ఆనకట్టని సందర్శించడానికి యెక్కువ మంది వచ్చారు.

ఇలా వచ్చినవారిలో చాలమంది ప్రముఖులు వున్నారు. వారి వివరాలుయివి :- ఆంధ్రప్రదేశ్ హోంశాఖామాత్యులు శ్రీ కె. వి. రంగా రెడ్డి,



*రాష్ట్ర ప్రణాళికల మంత్రి శ్రీ వి. బి. రాజు చవుటుప్పల జాతీయ విస్తరణ సేవాకేంద్రానికి ప్రారంభోత్సవం చేశారు.*

స్థానికపరిపాలన శాఖామాత్యులు శ్రీ కె. బ్రహ్మానంద రెడ్డి, కార్మిక, సాంఘికసంక్షేమశాఖామాత్యులు శ్రీ డి. సంజీవయ్య, రాష్ట్రరెవిన్యూబోర్డు సభ్యుడు శ్రీ గులాంహైదర్, శ్రీమతి శీలాభాయి దేశాయి, సర్వెంట్సు ఆఫ్ ఇండియాసొసైటీకి చెందిన శ్రీ పి. కోదండరావు, లండన్ బ్రిటిష్ మ్యూజియం క్యూరేటరు శ్రీ బ్యారెట్, అమెరికా ఓరిగాన్ విశ్వవిద్యాలయంనుంచి వచ్చిన ప్రొఫెసరు హాతీ, కేంద్ర జల, విద్యుచ్ఛక్తి కమీషన్ పూర్వపు అధ్యక్షుడూ, రూర్కీ ఇంజనీరింగు యూనివర్సిటీ వుపాధ్యక్షుడూ అయిన శ్రీ ఏ. ఎన్. ఖోస్లా.

సాంకేతిక విద్యాసంస్థలు, మామూలు విద్యాసంస్థలు రెండింటినుంచికూడా విద్యార్థులు పెద్ద పెద్ద జట్టులలో యిక్కడికి వస్తున్నారు. ఇది ప్రత్యేకించి చెప్పవలసిన విషయం. విద్యార్థులు, వృత్తివిద్యా శిక్షణ పొందుతున్న అధికార్లకి యీ అనకట్టస్థలం ఒక ముఖ్యాకర్షణగా వున్నది. డిసెంబరు నెలలో వచ్చిన ప్రేక్షకులలో మిక్కిలి యెక్కువసుంది, గిండీ యింజనీరింగుకాలేజీ, కాకినాడ పాలీటెక్నిక్ సంస్థ, హైదరాబాదు స్టాన్లీ బాలికోన్నతపాఠశాల, పెద్దపల్లి ప్రభుత్వోన్నతపాఠశాల, నల్గొండ వృత్తి విద్యాశిక్షణపాఠశాల, హిమాయత్‌సాగర్ వ్యవసాయ విస్తరణ సేవాకేంద్రం, కాకినాడ ఇంజనీరింగు కాలేజీ, హైదరాబాదు నిజాంకళాశాలలనుంచి వచ్చారు.

రాష్ట్రంలోని వివిధ జిల్లాలనుంచి రైతులు వచ్చారు ఇది చాలాముఖ్యమైన, సంతోషకరమైన విషయం. దృఢగాత్రులైన యీ రైతులు తమతమ స్త్రీజనంతోసహా యించుమించు తీర్థయాత్రకి వచ్చినట్టు, నడిచికాని పాతకాలపు యెద్దుబళ్ళలోకాని వచ్చారు. భారతీయ రైతాంగానికి స్వాభావికమైన వుత్సాహము, పట్టుదల వారిలో మూర్తీభవించాయి



చవుటుప్పల జాతీయ విస్తరణ సేవాకేంద్రానికి ప్రారంభోత్సవం చేస్తూ శ్రీ వి. బి. రాజు ప్రసంగిస్తున్న దృశ్యం.



*శ్రీ కంచుస్తంభం బాపన్న, వారి సతీమణి శ్రీమతి బాపనమ్మ*

ఆనకట్టస్థలం ప్రతిభాగాన్నీ వారు యెంతో మెల్లగా ఓపిగ్గా చూశారు. వారికి యెంతో పరిశీలనాదృష్టి, తెలుసుకోవాలనే వుత్సుకతా వున్నాయి. ప్రశ్నలు వేసి పనికి సంబంధించిన సూక్ష్మమైన వివరాలన్నిటిని వారు తెలుసుకున్నారు. పనిలో జరిగిన అభివృద్ధికి వారు యెంతో ఆనందించారు. జలాశయం నిలవ చేసే నీటి ప్రమాణాన్ని, ఆనకట్ట పూర్తయినతరువాత తమకి కలిగే లాభాలను గురించి తెలుసుకున్నమీదట, నిరక్షరాస్యుడైనా హిందూపురాణ గాథల్ని బాగా యెరిగిన ఒక ముసలిరైతు నాగార్జున సాగర్‌ని "కలియుగ కామధేనువు" అని సమయోచితంగా అభివర్ణించాడు.

రైతుస్త్రీలు, ఆచారంప్రకారం కృష్ణానదిలో డబ్బులువేసి, ఆనకట్ట సత్వర నిర్మాణానికై ప్రార్థించారు.

ప్రాజెక్టు నిర్వాహకులు అక్కడికివెళ్ళే ప్రజల అవసరాలను గుర్తించారు. వారివసతి సౌకర్యార్థం, నదికిరువైపులా అనువైన ప్రదేశాలలో రెండు విశ్రాంతి కేంద్రాలు నిర్మించబడినవి. ఇవిగాక, అధిక సంఖ్యలో వచ్చిన ప్రేక్షకుల వసతికై కొన్ని జనతా విశ్రాంతి కేంద్రాలుకూడావున్నాయి. రద్దీ హెచ్చి యివి చాలనందున, రూ. 2. 50 లక్షల వ్యయంపై 35 గదులుకల ఒక వసతిగృహం నిర్మించబడుతున్నది. చాలా త్వరలోనే అది పూర్తిఅవుతుంది.

## గ్రామనాయకుల శిబిరం

ఖమ్మంజిల్లా తిర్మలాయపాలెం సమాజాభివృద్ధి

కేంద్రంలోని తల్లంపాడు గ్రామంలో 1957 డిసెంబరు 17, 18 తేదీలలో గ్రామనాయకుల శిక్షణా శిబిరం యేర్పాటు చేయబడింది. తొమ్మిదిగ్రామాల నుంచి వచ్చిన యాభై మందికి వ్యవసాయం, పశుపోషణ, సహకారం, పంచాయతీలు, నీటిపారుదల మున్నగు విషయాలలో శిక్షణ యివ్వబడింది. పొగరాని పొయ్యిలనిర్మాణం, పెంటయెరువు తయారీ మున్నగు పనులు కూడా వారికి నేర్పబడినవి. ఆటలు, బుర్రకథలు, సినీమాప్రదర్శనలు యేర్పాటు చేయబడినవి. శ్రమదానంకూడా జరుపబడింది.

## భోనగిరి కేంద్రం

భోనగిరి జాతీయ వికాససేవా కేంద్రంలోని రహీంఖాన్‌గూడా గ్రామంలో 1957 డిసెంబరు 29 నుంచి 31 వరకూ గ్రామనాయకుల శిక్షణాశిబిరం యేర్పాటు చేయబడింది.

ఇక్కడ జరిగిన ప్రదర్శనలోని ఆధునిక వ్యవసాయ పరికరాలు, ఉత్తమవిత్తనాలు, రసాయన యెరువులు, పచ్చియెరువులు, ఉత్తమరకం పశుగ్రాసం, నమూనా పశువులకొట్టం, పొగరాని పొయ్యిలు, పంచవర్షప్రణాళిక అభివృద్ధి కార్యక్రమ కేంద్రాలు సాధించిన ఫలితాలకి సంబంధించిన స్టాలులను గ్రామీణులు ఆశక్తితో చూశారు.

గ్రామీణులు గ్రంథాలయం నిమిత్తం ఒకగదిని, కొంత సామానుని యిచ్చారు.

## ఆరోగ్య కేంద్రానికి విరాళం

పుల్లేటికుర్రు అభివృద్ధి కేంద్రంలోని వానపల్లి గ్రామస్థుడు శ్రీ కె. బాపన్న, వానపల్లిలో ప్రాథమిక ఆరోగ్య కేంద్రం నిర్మాణానికై 28-12-57న రూ. 10,000 రొఖ్ఖాన్ని, రెండు యెకరాల భూమిని విరాళమిచ్చారు.

## బూర్జా జా. వి. సే. కేంద్రం

శ్రీకాకుళంజిల్లా బూర్జాజాతీయ వికాస సేవా కేంద్రంలోని లుంబూరు గ్రామంలో 8-1-58 నుంచి 10-1-58 వరకూ ప్రత్యేకమైన మరొక గ్రామనాయకుల శిక్షణాశిబిరం యేర్పాటు చేయబడింది. లుంబూరు, పాలకొండ, వోనే, గారుగుబిల్లి, పెద్ద కోటిపల్లి గ్రామాల రైతులు, విద్యార్థులకి ప్రాతినిధ్యం వహించే గ్రామనాయకులు 42మంది యెన్నబడి, శిక్షణాశిబిరంలో చేర్చుకోబడ్డారు.

ఈ శిబిరానికయ్యే పూర్తి ఖర్చును భరించడానికి లుంబూరు గ్రామస్థులు పూనుకున్నారు. ఇది యీ శిబిరం యేర్పాటులో చాలా ముఖ్యమైన విషయం. పూర్తిగా ప్రజల డబ్బుతో వరుసగా జరుపబడిన గ్రామనాయకుల శిక్షణాశిబిరాలలో యిది నాల్గవది.

ఈ మూడు రోజులలోను అనేకమైన యితర పనులతోపాటు, అభివృద్ధికేంద్రం సిబ్బంది, శిక్షణకై చేరినవారు కలిసి గ్రామం వీధుల్ని శుభ్రపరచి నదిఒడ్డుకి మెట్లుకట్టారు.

## వంతెనల నిర్మాణం

బోయనపూడి, కాపవరం గ్రామాలలో వంతెనల నిర్మాణానికై ఆయా గ్రామాల ప్రజలు పంపిన విరాళాల్ని వరుసగా రూ 100/, రూ. 600- లను జనవరి 16వ తేదీన సామర్లకోట బ్లాకు ప్లానింగు అభివృద్ధిసంఘం స్వీకరించింది. ఆయా గ్రామాలలో వంతెనలనిర్మాణంఖర్చు అంచనా వరుసగా రూ. 400, రూ. 2,400.

## చేవెళ్ల జా. వి. సే. కేంద్రం

హైదరాబాదుజిల్లా చేవెళ్ళ జాతీయ వికాస సేవా కేంద్రంలోని కాక్లూరులో 7-1-58 నుంచి 9-1-58 వరకూ ఒక ప్రత్యేకమైన గ్రామనాయకుల శిక్షణాశిబిరం యేర్పాటుచేయబడింది. కాక్లూరు మండలంగ్రామాలకిచెందిన యించుమించు యాభై మంది శిబిరానికి హాజరయారు.

# చిన్న మొత్తాల పొదుపు

శ్రీ వి. టి. కృష్ణమాచారి
ప్లానింగ్ కమీషన్ ఉపాధ్యక్షులు

ద్వితీయపంచవర్ష ప్రణాళిక ప్రారంభమైనప్పటి నుండి దేశవ్యాప్తంగా తీవ్రతరమైన కార్యక్రమాలు అమలు జరుగుతున్నవి. ప్రథమ పంచవర్ష ప్రణాళిక మన దేశంలో సత్వర ఆర్థికాభివృద్ధి సాధన క్రమానికి దృఢమైన పునాదులు నిర్మించింది. ఈ పునాదులమీద సంతృప్తి కరమైన విధంగా దేశ [illegible] సౌధం నిర్మించ బడవలసి వున్నది. ద్వితీయ పంచవర్ష ప్రణాళికను గురించిన ప్రణాళికా సంఘంవారి నివేదికలో మనకు లభించ గల వనరులన్నింటినీ పూర్తిగా వినియోగించు కోవటానికి అనువైన ప్రతిపాదనలు రూపొందించ బడినవి. ఆర్థిక స్వాతంత్ర్యసాధన, జాతీయాభివృద్ధిసాధన లక్ష్యాలుగాగల బ్రహ్మాండమైన జాతీయ పునర్నిర్మాణ కార్యక్రమంలో వివిధ రంగాలకు, వర్గాలకు చెందిన ప్రజలనుండి నిర్మాణాత్మకమైన సహకారం లభించడం అత్యవసరం. ప్రజలు సమస్యలను సూక్ష్మంగా పరిశీలించి, సరిగా గ్రహించటం, బాధ్యతలను పైన వేసుకుని నిర్వహించటానికి మనస్ఫూర్తిగా సిద్ధమై సుముఖత్వమును ప్రదర్శించటం, ప్రణాళిక విజయసాధనకు ప్రారంభ సూచకములైన ప్రజోత్సాహ శక్తులుగా పనిచేయగలవు.

పబ్లిక్ రంగంలో రూ. 4,800 కోట్ల మొత్తం పెట్టుబడితో, ప్రైవేటు రంగంలో రూ. 2,400 కోట్ల పెట్టుబడితో, ద్వితీయ పంచవర్ష ప్రణాళిక కాలంలో జాతీయాదాయం 25 శాతం పెరుగగలదని, సుమారు ఒక కోటి మందికి ఉద్యోగావకాశాలు లభించ గలవనీ ఆశించ బడుతున్నది. మొదటి పంచవర్ష ప్రణాళిక సైజుకంటే, ద్వితీయ ప్రణాళిక రెండింతలు పెద్దది. అందువల్ల దేశంలోగల వనరులను, అవకాశాలను దీనికొరకు సమీకరించు కొనుటలో ఎక్కువ తీవ్రంగా కృషి చేయవలసిన అవసరం ఏర్పడింది. ప్రస్తుతం వున్న రివిన్యూ పద్దులలో మిగులు రూపంలో రూ. 800 కోట్లు లభించగలదని అంచనా. రైల్వేలనుండి ఆదాయం, ప్రావిడెంట్ ఫండు, యింకా యితర డిపాజిట్ల పద్దులనుండి రూ. 400 కోట్లు లభించవచ్చు. ప్రజలనుండి ధన సేకరణ ద్వారా రూ. 1,200 కోట్లు సాధించవచ్చు. ఈ మొత్తంలో ప్రజలనుండి ఋణం రూపంలో రూ. 700 కోట్లు చిన్న మొత్తాల పొదుపు ఉద్యమం క్రింద రూ. 500 కోట్లు సేకరించాలని సంకల్పం. అప్పటికీ మిగిలిన మొత్తంలో రూ. 1,200కోట్లు డెఫిసిట్ ఫైనాన్సింగ్, రూ. 800 కోట్లు విదేశ సహాయంపోను, యింకా ద్వితీయపంచవర్ష ప్రణాళిక కాలంలో రూ. 400 కోట్ల తరుగు ఏర్పడుతుంది. దీనినిబట్టి దేశంలోని వివిధ అవకాశాలను క్షుణ్ణంగా వినియోగించు కోటానికి తీవ్రమైన కృషి అత్యవసరమనే విషయం స్పష్టమవుతున్నది. కాగా చిన్న మొత్తాల పొదుపు ఉద్యమానికి ప్రజలు చేసే సహకారం, జాతీయ నిర్మాణ కార్యక్రమాల్లో వారు స్వేచ్ఛగా, మనస్ఫూర్తిగా ఎంతవరకు పాల్గొంటున్నారో తెలియ పరచు సూచికవంటిది.

## 50 శాతం పెరుగుదల అవసరం

చిన్న మొత్తాల పొదుపుద్వారా ధన సేకరణను పెంచటానికి చాలా అవకాశాలు వున్నవి. నిజానికి ప్రథమ పంచవర్ష ప్రణాళిక కాలంలోనే యీ రంగంలో ప్రజల సహకారం సంతృప్తి కరంగా

లభించింది.* 1951-52 లో యీపొదుపు ఉద్యమం ద్వారా వసూళ్లు మొత్తం రూ. 38.7 కోట్లు, 1952-53 లో రూ. 39.8 కోట్లు, 1953-54 లో రూ. 39.7 కోట్లు, 1954-55 లో రూ. 55.5 కోట్లు, 1955-56 లో రూ. 65.3 కోట్లు జరిగినవి. ద్వితీయ ప్రణాళిక కాలంలో డబ్బు కూడబెట్టు స్థాయిని యింకా ఎక్కువ చేయవలసి వున్నది. కనీసం సంవత్సరానికి సగటున రూ. 100 కోట్లు అయినా పొదుపు చేయబడాలి. ద్వితీయ ప్రణాళిక ప్రథమ సంవత్సరంలో రూ. 100 కోట్లకంటే కొంచెం తగ్గినా చివర సంవత్సరంలోనైనా యిది బాగా పెరగాలి. అంటే సుమారు 50 శాతమైనా అప్పటికి పెరుగు తేనేగాని, అనుకున్న ప్రకారం, దేశంలోని ఆర్థికావ కాశాలను పూర్తిగా వినియోగించు కోవటానికి అవకాశం ఉండదు.

ద్వితీయ పంచవర్ష ప్రణాళిక విజయవంతం కావటానికి చిన్న మొత్తాల పొదుపు ఉద్యమం యొక్క ఆవశ్యకతను దేశంలోని వివిధ రాజకీయ పార్టీలు కూడా గుర్తించటం ముదావహం. 1956 ఫిబ్రవరిలో అమృతసర్ లో జరిగిన అఖిల భారత కాంగ్రెసు 61వ వార్షిక మహాసభలో యీ ఉద్య మానికి సహాయం చేయవలసిందని భారత ప్రజలకూ ముఖ్యంగా కాంగ్రెసు సభ్యులకు విజ్ఞప్తిచేస్తూ తీర్మానించ బడటం యీ విషయంలో ముఖ్యమైన సంఘటన. "ఎక్కువమంది యిచ్చిన తక్కువ మొత్తాలు కలిసి పెద్ద మొత్తమవుతుంది. మన ఆర్థిక అంచ నాలలోని లోట్లను ఆ మొత్తాలు భర్తీ చేయగలవు" అని పేర్కొన్న తీర్మాన భాగం అక్షరాల నిజం. యింకా ఆ తీర్మానంలో యీ విధంగా ప్రజలకు విజ్ఞప్తి చేయబడింది.

"తన ప్రాథమికావసరాలను తీర్చుకున్న అనం తరం, తన కొరకు కాక తన మాతృభూమి కొరకు డబ్బు ఖర్చు చేయటం ప్రతి భారతీయునికి ప్రథమ కర్తవ్యం. ప్రభుత్వ ఋణాలలోనూ, చిన్న మొత్తా లలోనూ పెట్టుబడి పెట్టటంద్వారా, అతడు యీ మహాప్రయోగంలో స్వయంగా పాల్గొనటమే కాకుండా, తనకూ, తన కుటుంబానికి కూడా మేలుచేసిన వాడవుతాడు. భారతదేశంలో సమృద్ధి, అభ్యుదయ సాధన అంటే, మన ప్రజలందరికీ ఉన్నత జీవన ప్రమాణాలను సాధించి, మేలైన, అనుకూలమైన జీవన పరిస్థితులను, అవకాశాలనూ కల్పించటమే."

ఈ తీర్మానమును అమలు పరచుటకై కాంగ్రెసు వారు చిన్న మొత్తాల పొదుపు సంఘమును ఒక దానిని ఏర్పాటు చేశారు. ఈ సంఘం యీ సమ స్యను సాకల్యంగా చర్చించి, రాష్ట్రముఖ్య మంత్రులు, ఆర్థిక శాస్త్రవేత్తలు, పార్లమెంటు సభ్యులు మొదలగువారి వద్దనుండి అభిప్రాయాలు సేకరించింది. చిన్న మొత్తాల పొదుపు ఉద్యమానికి ప్రజాసహకారమును సమీకరించుటలోనూ, దేశంలో యీ ఉద్యమాన్ని శక్తివంతము చేయుటలోనూ యీ చర్య చాలా ప్రధానమైనది. యీ సంఘం వారి కోర్కె ననుసరించి చేయబడిన సూచనలు కూడా ప్రధాన మైనవి. ఈ విషయంలో ఆసక్తిగల వ్యక్తులు, సంస్థలుకూడా యీ సంఘంవారి సిఫార్సు లను శ్రద్ధగా ఆలోచించవలసి వున్నది. కాంగ్రెసు ఏర్పాటు చేసిన చిన్న మొత్తాల ఉద్యమ సంఘం వారి నివేదికలో, చిన్న మొత్తాల సమీకర ణకు నిర్దిష్టమైన కొన్ని మార్గాలు సూచింపబడినవి. నేనుకూడా యీ ఉద్యమాన్ని శక్తివంతం చేయ టానికి నాకు తోచిన కొన్ని సలహాలను గురించి ప్రస్తావిస్తాను.

## ఉద్యమ తీవ్రతకు రెండు పద్ధతులు

రెండు విధానాల ననుసరించి చిన్న మొత్తాల పొదుపు ఉద్యమాన్ని తీవ్రతరం చేయవచ్చు. మొద టిది ప్రస్తుతం యిందు కొరకు పని చేస్తున్న సంస్థ లను పునర్నిర్మించటం; రెండవది యీ విషయం గురించి ప్రజల ఉత్సాహాన్ని పెంపొందించుటకు ప్రయత్నించటం. యీ కృషిని తీవ్రతరం చేయు టకు అనేక దృక్పథాలతో అనేక విధానాలు అనుస రించ బడవచ్చు. దేశంలోని వివిధ రంగాలనుండి పొదుపు ఉద్యమ శక్తులను సమీకరించటానికై సవివరమైన పథకమును గురించి నేను ప్రస్తుతం ప్రస్తావించను. కాని యిందుకు అవసరమైన నిర్దిష్ట మైన సూచనలు ఏమైనా చేస్తే, వాటివల్ల ప్రయో జనం ఉండవచ్చు.

గ్రామీణ ప్రాంతాలలో పొదుపు ఉద్యమాన్ని బలిష్టం చేయటానికి జాతీయ విస్తరణోద్యమమే చక్కని సాధనము. ఈ ఉద్యమంలో వివిధ స్థాయిలలో అనధికార, అధికార ప్రముఖుల ప్రమేయం ఉన్నందుననూ, యీ ఉద్యమం వ్యాపించిన ప్రాంతంలోని ప్రతి కుటుంబంతోనూ నిరంతర సంబంధాన్ని కలిగి ఉండటం చేతనూ, విస్తరణోద్యమం పొదుపు ఉద్యమానికి తోడ్పడ గలుగుతుంది. విస్తరణోద్యమం వ్యాపించని ప్రదేశాలలో అటువంటిదే మరొక పద్ధతిని రూపొందించు కోవచ్చు. పొదుపు ఉద్యమానికి విరాళాలు యివ్వగల వివిధ వర్గాల ప్రజలు ఎవరంటే (1) ప్రాథమిక ఉత్పత్తిదార్లు—పెద్ద భూస్వాములు, కౌలుదార్లు, (2) వడ్డీ వ్యాపారులు, గ్రామాలలోని వర్తకులు (3) కౌలు రేటు నిర్ణయమువల్ల ప్రయోజనం పొందినట్టియు, జాతీయ విస్తరణోద్యమం, కమ్యూనిటీ అభివృద్ధి పథకాలవల్ల ప్రయోజనం పొందినట్టియు మధ్య తరగతి, చిన్న రైతులు. (4) లఘు పరిశ్రమల అభివృద్ధి కొరకై రాష్ట్ర ప్రభుత్వము అమలుపరచు పథకాల వల్ల [illegible] గ్రామీణ [illegible].

ఒక ముఖ్య విషయం ప్రత్యేకంగా ప్రస్తావించ వలసి వున్నది. ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో యిరిగేషన్ సౌకర్యాలక్రింద మధ్య తరహా ప్రాజక్టులకు ఎక్కువ ప్రాధాన్యం యివ్వబడింది. అనేక మధ్య తరహా ప్రాజక్టులు దేశం నలుమూలలా నిర్మించబడ నున్నవి. ఈ ప్రాజక్టు ప్రదేశాలలో కార్మిక సహకార సంఘాలను ఏర్పాటుచేసి, వాటికి పనులను వప్పగించటం ద్వారా, యిక్కడ జరిగే ఖర్చు ప్రజల వద్దకు చేరి, వారు దానిని మిగిల్చు కోటానికి అవకాశం ఏర్పడుతుంది. అంతేకాక యిరిగేషన్ పథకాల ద్వారా ప్రయోజనం పొందే భూఖామందులు, అభివృద్ధి పన్నులను చెల్లించటమే కాక, వీలైనప్పుడల్లా డబ్బు పొదుపు చేయాలని వారిని కోరటం కూడా జరుగవలసి వున్నది.

గ్రామీణ ప్రాంతాల్లో సంస్థా రూపకమైన కృషి సహకార సంఘాలద్వారా జరగటం ఉత్తమం. ఎందుకంటే అఖిలభారత గ్రామీణ పరపతి సౌకర్యాల సర్వే నివేదికలో యీ విధంగా చెప్పబడి వున్నది. "సహకార సంఘ వ్యవస్థ సేవింగ్స్‌ను వృద్ధి చేయాలంటే, దానిని పటిష్టం చేయటమే అన్నింటి కంటే ఉత్తమమైన పద్ధతి. అప్పుడే అది ప్రజలలో విశ్వాసాన్ని రేకెత్తించ గలుగుతుంది. తద్వారా సహకారోద్యమం వ్యాపించి, దాని కార్యకలాపాలు విస్తృతమై, ముఖ్యంగా ఆర్థికరంగంలో ప్రజలను చైతన్య వంతులను చేసి స్థానికంగా వారిలో ఉత్సాహాన్ని పెంపొందింప జేయుటానికి అవకాశం ఏర్పడుతుంది". జాతీయ విస్తరణోద్యమం యొక్క ప్రధాన ఆశయంకూడా యిదే.

పట్టణ ప్రాంతాలలో పొదుపు ఉద్యమం వ్యాప్తి కొంతవరకు సుకరమైనదే. గ్రామాల్లోకంటే పట్టణ ప్రాంతాల్లోనే జాతీయ పొదుపు ఉద్యమం బాగా వ్యాప్తి చెందింది. పురపాలక వ్యవహారాల నిమిత్తం ప్రతి పట్టణం కూడా కొన్ని ఖండాలుగా విభాగించ బడివున్నది. ఈ విభాగాలను వార్డులంటారు. పొదుపు ఉద్యమవ్యాప్తికి యీ వార్డులను యూనిట్లుగా తీసుకొని అనధికార సంస్థలు ఏర్పడి పనిచేయాలి. యిక్కడ కూడా ప్రతికుటుంబంతోనూ సంబంధం ఏర్పాటు చేసు కోవటం అవసరం. అంతే కాక నెలనెలా వారు డబ్బు కూడబెట్టుకోటానికి తగిన సౌకర్యాలు కూడా సమకూర్చాలి.

ప్రతిప్రభుత్వ కార్యాలయంలోనూ, లేక స్థానిక సంస్థలు, పబ్లిక్ లేక ప్రైవేటు కంపెనీల ఆధ్వర్యాన గల కార్యాలయాలలోనూ పొదుపు ఉద్యమవ్యాప్తికి అనువైన ఏర్పాట్లు చేసుకోవాలి. కొద్ది మొత్తాల బాండ్లు త్వరగా లభ్యమగునట్లు ఏర్పాటుచేయుటయే కాకుండా, తక్కువ జీతాలు కలవారికి ఋణము లిచ్చుట మొదలగు సౌకర్యాలు కూడా చేయబడ వలెను.

ఈ జాతీయ కార్యక్రమంలో ప్రతి కార్మికుడు కూడా పాల్గొనేటట్లు చేయుటకై కార్మికోద్యమ నాయకులవద్ద నుండి కూడా పూర్తి సహకారం లభించ గలదనే ఆశిస్తున్నాను. ఒక్కొక్క వ్యక్తిని దృష్టిలో పెట్టుకుని చూస్తే అతడు మిగిల్చే మొత్తం కొద్ది అయినా, అందరినీ కలిపిచూస్తే యీ అయిదేండ్ల కాలంలో చాలా పెద్ద మొత్తమే సాధించటానికి వీలున్నది. ప్రభుత్వ ఆధ్వర్యానగానీ, ప్రైవేటు సంస్థల ఆధ్వర్యానగానీ పారిశ్రామిక ప్రాజెక్టులు పనిచేస్తున్న ప్రదేశాల్లో కార్మికులకు

వచ్చే నెలజీతములో కొంత భాగమును బాండ్ల రూపంలో స్వీకరించు ఏర్పాటు చేయుటకు కూడా ప్రయత్నం జరుగవలసివుంటుంది.

పట్టణప్రాంతంలోగానీ, పల్లెప్రాంతాల్లోగానీ ప్రతి కుటుంబమునుండి కొంత మొత్తమును పొదుపు ఉద్యమం క్రింద వసూలు చేయటానికీ, ప్రతి కార్యాలయంలో కూడా యిట్టి ఏర్పాటు జరగ టానికి కృషి చేయాలి. తమ జీతములో కొంత భాగమును బాండ్లరూపంలోనూ, సేవింగ్స్ సర్టి ఫికెట్ల రూపంలోనూ ఆమోదించి స్వీకరించుటకు కార్మికులను అంగీకరింపజేయుటకై కార్మికనాయ కుల సహకారమును సమీకరించాలి. యీ పద్ధతు లన్నీ ఉదాహరణ ప్రాయములే. యింకా ఉన్న యితర విధానాలు, మార్గాలు, స్థానిక కార్య కర్తలు యీ కార్యక్రమంలో తిరిగి పనిచేస్తున్న సమయంలో వారికే స్ఫురించగలవు. కాని ఒక విషయం మాత్రం ప్రధానంగా గుర్తు వుంచు కోవాలి. అదేమంటే, యీ విషయంలో ఎంత మాత్రం నిర్బంధం కూడదు. స్వేచ్ఛగా ప్రజలు సహకరించే ఏర్పాట్లు చేయాలిగాని వారిని నిర్బం ధించరాదు. జాతీయ ప్రణాళిక విజయవంతం కావ టానికి పొదుపు చేయటం ఎంతో ముఖ్యము అనే విషయంలో ప్రజాభిప్రాయమును కూడ గట్టుకొని ప్రజలను చైతన్యవంతులుగా చేయటం అత్యవసరం. అంతేకాక దేశమంతటా కూడా, యీ పొదుపు ఉద్యమాన్ని నిర్మించి, నిర్వహించి, ఉచ్ఛస్థాయికి చేర్చే యావత్తు బాధ్యత అనధికార ప్రముఖులకే వదలి వేయటం అత్యుత్తమైన పద్ధతి:

[ఇండోర్ నుండి వెలువడే "కాంగ్రెస్ సందేశ్" నుండి]



# బేసిక్ విద్య

శ్రీ యం. యస్. రావు,

విద్యాశాఖ రీజినల్ డిప్యూటీ డైరెక్టరు, అనంతపూరు.

పిల్లలు ఉత్తమ పౌరులుగా అభివృద్ధి చెందాలంటే వారి విద్యాభ్యాసానికి అవసరమైన సౌకర్యాలన్నీ సమకూర్చాలి. పిల్లలు శారీరకంగాను, మానసికంగాను, నైతికంగాను యోగ్యులై సంఘంలో గౌరవ ప్రతిష్ఠలతో మెలగాలంటే వారికి తగిన శిక్షణ గరపాలి.

ప్రస్తుతం వున్న ఎలిమెంటరీ, సెకండరీ, యూనివర్సిటీ విద్య, జీవితానికి ఉపయోగపడు ప్రాథమిక వృత్తులలో అంటే వ్యవసాయం, పాడిపంటల అభివృద్ధి, నేత మున్నగు వాటిలో పిల్లలకు శిక్షణ ఇచ్చుటకు సంపూర్ణ అవకాశాలు కల్పించడం లేదు. ఇట్టి విద్య పుస్తకాల వరకే పరిమితమై ఉంది. వాస్తవిక ప్రపంచానికి యెక్కువగా ఉపకరించదు. ఈ విద్యకు పరీక్షలే ముఖ్యం. పరీక్షల్లో కూర్చొని నెగ్గిన విద్యార్థుల సంఖ్యను బట్టి, పాఠశాల చేస్తున్న కృషి, ఉపాధ్యాయుల శక్తి సామర్థ్యాలు లెక్కకట్టడం పరిపాటయి పోయింది. కానీ బేసిక్ వృత్తిపనులలో నైపుణ్యం, నాయకత్వం వహించుటకు శక్తి సామర్థ్యాలు, యోగ్యతలు వున్నాయా లేవా అనే విషయం అంత పట్టింపులోకి రావడం లేదు.

భవిష్యత్తులో భారతదేశం బాగుపడాలంటే ప్రతి యొక్కరు నడుమువంచి కృషి చేయాలి. ప్రజల జీవన పరిమాణాన్ని పెంచుటకు యథాశక్తి తోడ్పడాలి. మొత్తం మీద విద్య పనిలో శ్రద్ధ కల్పించాలి. పని చేయుటకు శక్తి సామర్థ్యాలు ప్రసాదించాలి. అన్ని పాఠశాలల్లో వృత్తి పనులను నేర్పించుటకు సౌకర్యాలు వుండాలి. ఈ విషయంలో మనం ఒక్కడుగు ముందుకు వేశామని చెప్పవచ్చు. ఎలిమెంటరీ స్కూళ్ల కొరకు ఉపాధ్యాయులకు బేసిక్ విద్యలో శిక్షణ ఇవ్వబడుతున్నది. జూనియర్, సీనియర్ బేసిక్ స్కూళ్లు నడిపించబడుతున్నవి. బేసిక్ ట్రేయినింగు స్కూళ్లకు పరిశీలక సిబ్బందిని ఉపాధ్యాయ సిబ్బందిని లభింపజేసే ఉద్దేశంతో పట్టభద్రులైన ఉపాధ్యాయులకు బేసిక్ విద్యలో తిరిగి శిక్షణ ఇవ్వడం జరుగుతున్నది. పోస్టు-బేసిక్ స్థాయిలో కూడా పని ప్రగతి చెందుతున్నది. ఇది హైయ్యర్ ఫారములు, సెకండరీ స్కూళ్ల స్థాయితో సమానమైనది.

ఇంతవరకు సాధించిన ఫలితాలు ప్రోత్సాహజనకంగా వున్నవి. బేసిక్ శిక్షణ పొందిన ఉపాధ్యాయుడు మామూలు శిక్షణ పొందిన ఉపాధ్యాయుని కన్నా ఎన్నో రెట్లు మెరుగు. ఎందుకంటె అతనికి ఏదో ఒక వృత్తి పనివచ్చు. పాఠశాలలో రెండేండ్లు అందరితో కలిసి మెలసి అన్ని కార్యకలాపాలలో పాల్గొని శిక్షణ పొందినట్టివాడు. అంతేగాక చాలా వరకు బేసిక్ ట్రేయినింగ్ కేంద్రములు జానపదములలో నెలకొనియున్నందున గ్రామీణ ప్రజలతో సన్నిహిత సంబంధం ఏర్పరచుకొనుటకు అవకాశం లభిస్తుంది. గ్రామ పాఠశాలోపాధ్యాయు పదవిని నిర్వహించుటకు అతడు అర్హుడు. గ్రామీణ ప్రజల సహకారం పొందుతున్నాడు. ఎందుకంటే బేసిక్ శిక్షణ పొందిన ఉపాధ్యాయుడు గ్రామస్థుల పిల్లలకు చదువు నేర్పడమేగాక వారికి వృత్తి పనులలో శిక్షణ కూడా ఇచ్చి వారిలో ఆత్మ విశ్వాసాన్ని పెంపొందిస్తున్నాడు. కనుకనే ఇంత వరకు చేసిన కృషిచాలా ధైర్యోత్సాహాలను పూరించింది. సెకండరీ, యూనివర్సిటీ విద్యనంతటినీ బేసిక్ విద్యగా మార్చి వేసినట్లయితే జాతిలో ఒక నూతనోత్సాహం రేకెత్తుతుంది. నవయువకులలో దేశభక్తి, ఆత్మగౌరవము, ఆత్మవిశ్వాసం, వృత్తి పనులు కళలల్లో విశిష్ట నైపుణ్యత మున్నగు లక్షణములు వుండగలవు.

చర్చాగోష్ఠి :

# లఘు కుటీర పరిశ్రమల అభివృద్ధి

ఆకాశవాణి హైద్రాబాదు కేంద్రంనుంచి 28-12-1957 తేదీన లఘు, కుటీర పరిశ్రమల అభివృద్ధి విషయమై చర్చాగోష్ఠి ప్రసారం చేయబడింది. ఈ గోష్ఠిలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ వాణిజ్య పరిశ్రమలశాఖ జాయింట్ డైరెక్టర్ శ్రీ బి. నరసింహారావు, రాష్ట్ర ఖాదీగ్రామీణ పరిశ్రమలబోర్డు తాత్కాలిక కార్యదర్శి శ్రీ దామోదరరావు, "ఆంధ్రప్రభ" ప్రతినిధి శ్రీ టి. వి. కృష్ణ గారలు పాల్గొన్నారు. వారి చర్చల సంగ్రహ పాఠం యిది.-

శ్రీ టి. వి కృష్ణ:- ఈనాడు లఘుపరిశ్రమల అభివృద్ధి విషయమై సర్వత్రా అభిప్రాయాలు వెలువడుతున్నవి. మరి మీరు వాణిజ్య పరిశ్రమలశాఖ జాయింట్ డైరెక్టరుగా వున్నారుకదా. ఈవిషయంలో మీకు హెచ్చుశ్రద్ధ వుందనుకుంటాను. మీ అభివృద్ధి పథకాలేమిటో ఇంతవరకు ఎంత అభివృద్ధి సాధింపబడిందో తెలియజేస్తారా? మన ఆర్థిక వ్యవస్థలో, జాతీయ పథకరచనలో లఘు, కుటీర పరిశ్రమలకు ప్రముఖ స్థానమున్నదికదా.

శ్రీ నరసింహారావు:- అవును కృష్ణాగారూ. మీరు ప్రశ్న వేయడం సమంజసంగావుంది. లఘు కుటీర పరిశ్రమలకు మన ఆర్థికవ్యవస్థలో నిజంగా ప్రముఖ స్థానమున్నది. వాటి అభివృద్ధి విషయంలో ప్రతి భారతీయుడు శ్రద్ధవహించాలి. మన ధ్యేయం శ్రేయోరాజ్యస్థాపన. కనుక దేశ ఆర్థిక వ్యవస్థను సాధ్యమైనంత త్వరలో మనం వృద్ధిచెయ్యాలి. జాతీయాదాయాన్ని హెచ్చించడానికి భారత ప్రభుత్వం పట్టుదలతో పనిచేస్తూవుంది. అటువంటప్పుడు దేశాన్ని పారిశ్రామికం చేయడం చాలా ముఖ్యమైన సమస్య అవుతుంది. గ్రామప్రాంతాలలో లఘుపరిశ్రమలను అభివృద్ధి పరచడంలోని ఒక ముఖ్య లక్ష్యం ఏమిటంటే ప్రజల ఆదాయాన్ని హెచ్చింపజేసి, జీవన ప్రమాణాన్ని పెంపొందింపజేసి, హెచ్చుతగ్గులు సరి యిదిగాంచేసి సమ ఆర్థిక వ్యవస్థను రూపొందించడమే. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం పారిశ్రామికంగా ఎంతో అభివృద్ధి చెందలేదు. మొదటి పంచవర్ష ప్రణాళికలో వ్యవసాయానికి హెచ్చు ప్రాముఖ్యమివ్వబడింది. అయితే భూమిమీద రైతుల ఒత్తిడిని తగ్గించి, ఎక్కువగావున్న మనుష్యులను ప్రత్యామ్నాయ పరిశ్రమలలోకి మళ్ళించకపోతే కేవలం వ్యవసాయాన్ని ఎంత అభివృద్ధిపరచినా అంతగా ప్రయోజనముండదు. ఈసందర్భంలో మనం మరో యదార్థాన్ని కూడా గుర్తుపెట్టుకోవాలి. ఏమిటంటే వ్యవసాయంలో ఎంతమంది మనుష్యులు పనిచేస్తారో అంతేమంది పరిశ్రమలలో గనుక పనిచేసినట్లయితే వ్యవసాయంలోకంటె ఎక్కువ ఉత్పత్తిని పరిశ్రమలలో సాధించగలుగుతారు. ఈ కారణంవల్ల కూడా పారిశ్రామికాభివృద్ధి అత్యావశ్యకమైనదని స్పష్టమవుతున్నది. ఈవిషయములో మొదటి ప్రణాళిక కాలములోనే కృషి ఆరంభింపబడింది. అయితే మొదటి ప్రణాళికలో ప్రభుత్వరంగములో యెక్కువ పరిశ్రమలు తలపెట్టబడలేదు.

శ్రీ దామోదరరావు:- మన ఆర్థిక వ్యవస్థలో లఘు కుటీర పరిశ్రమల పాత్రను నేనుకూడా అంగీకరిస్తున్నాను. ముఖ్యముగా పల్లెల అభివృద్ధికి యీ పరిశ్రమలు అతి ప్రధానమైనవి. వీటిలో రెండవ ప్రణాళికలో ఏయే పరిశ్రమలను అభివృద్ధి పరు

స్తారో మొదటి ప్రణాళిక సాధించిన ఫలితాలేమిటో తెలియపరుస్తారా ?

### బోర్డువారి కృషి

శ్రీ నరసింహారావు:- గ్రామీణ లఘుపరిశ్రమల అభివృద్ధి నిమిత్తమై మొదటి ప్రణాళిక కాలంలో ఒక ముఖ్యమైనచర్య గైకొనబడింది. ఏమిటంటే చేనేతపరిశ్రమ, ఖాదీ గ్రామీణ పరిశ్రమలు, చేతి పరిశ్రమలు, స్వల్పపరిశ్రమలు, పట్టుపరిశ్రమ, పీచు పరిశ్రమ మొదలైన వాటికి సంబంధించిన సమస్యలను పరిష్కరించడానికై అఖిలభారత బోర్డులు ఏర్పాటు చేయబడ్డవి. ఈ బోర్డులు కొన్ని సాధారణ సూత్రాలను ప్రవేశపెట్టాయి. వివిధ పరిశ్రమల అభివృద్ధి కొరకు తగు నిధులను కేటాయించవలసిందిగా సిఫారసు చేశాయి. అంతేగాక యీ పరిశ్రమలకు సంబంధించిన అనేక పరిశీలనలను జరిపించాయి. ప్రణాళిక కాలంలో క్లిష్టస్థితిలోవున్న చేనేత పరిశ్రమకు ఎంతోచేయూత యివ్వబడింది. ఆంధ్రప్రదేశ్‌లో యీనాడు 5 లక్షల నూలు మగ్గాలు, 14000 ఉన్నిమగ్గాలు వున్నవి. చేనేత పరిశ్రమ సుస్థిరమైన పునాదులపై నిలబడడానికి కొన్నిచర్యలు గైకొనబడ్డవి. చేనేత పనివారల సహకారసంఘాలు, ప్రభుత్వ విక్రయశాలలు చేసే అమ్మకాలన్నిటిపై రూపాయకు అణాన్నర చొప్పున రిబేటు మంజూరు చేయబడింది. వాటామూలధనానికీ, పెట్టుబడిధనానికి అప్పులివ్వబడ్డవి. మేలురకం పరికరాలు సప్లయి చేయబడ్డవి. ఆంధ్రప్రదేశ్ గ్రామీణ లఘుపరిశ్రమల అభివృద్ధికొరకై రెండవ ప్రణాళికలో రూ.1152. 23 లక్షలఖర్చు కేటాయింపబడింది.

శ్రీ కృష్ణ:- ఈ ఖర్చు కార్వేసంఘంవారి సిఫారసుల ననుసరించి నిర్ణయించబడిందాండీ ?

శ్రీ నరసింహారావు:- అవునండీ. ఆవిషయాని కొస్తున్నాను. ఇప్పుడే చేనేత పరిశ్రమనుగూర్చి చెప్పానుకదా. మరి కుటీర పరిశ్రమలన్నిటిలో చేనేత పరిశ్రమ పెద్దది కదండీ. కార్వేసంఘంవారి సిఫారసుల ననుసరించే దేశంలోని గ్రామీణ స్వల్ప పరిశ్రమల అభివృద్ధికొరకై భారతప్రభుత్వం రూ.200 కోట్ల ఖర్చును కేటాయించింది. అయితే యీ ఖర్చులో అంబర్‌చరఖా కార్యక్రమానికిగాని, పవర్‌మగ్గాలకుగాని ప్రత్యేకించి కేటాయింపులు చేయడం జరగలేదు. ప్రణాళిక కాలంలో మొదటి రెండుమూడు సంవత్సరాలు వివిధ గ్రామీణ లఘు పరిశ్రమల అభివృద్ధికి అవసరమైన పెట్టుబడిధనాన్ని ప్రభుత్వం లభింపజేస్తుంది. పెట్టుబడిధనం సాధారణంగా బ్యాంకులు ఇతర సంస్థలద్వారా లభ్యమువడానికి ఏర్పాట్లు జరిగేటంతవరకు ప్రభుత్వం యీ విధంగా లభింపజేస్తూనేవుంటుంది. పోతే ఆంధ్రప్రదేశ్‌కు లఘుపరిశ్రమల నిమిత్తమై కేటాయింపబడిన డబ్బు రూ. 1152. 23 లక్షలని యింతకు క్రితమే చెప్పానుకదా. ఆమొత్తం కేటాయింపు వివరాలుయివి.

| పరిశ్రమ | | కేటాయింపు (రు. లక్షలలో) |
|---|---|---|
| 1. చేనేత | ... | 456.22 |
| 2. లఘు పరిశ్రమలు | ... | 312.44 |
| 3. పారిశ్రామిక ఎస్టేట్లు | ... | 97.38 |
| 4. పీచు పరిశ్రమ | ... | 4.00 |
| 5. చేతిపరిశ్రమలు | .... | 35.05 |
| 6. పట్టుపరిశ్రమ | .... | 21.38 |
| 7. గ్రామీణ పరిశ్రమలు | .... | 1930.45 |
| 8. ఇతర సాధారణపథకాలు | ... | 31.31 |
| | మొత్తం | 1152.23 |

లఘు పరిశ్రమల అభివృద్ధికి ఎన్నో అవకాశాలున్నవి. కొద్దిమాత్రపు పెట్టుబళ్ళనూ, పనివారల నైపుణ్యాన్నీ ఈ పరిశ్రమలకు చక్కగా వినియోగించుకోవచ్చును. యీ లఘుపరిశ్రమలలో కొన్ని పోషక పరిశ్రమలుగా ఉపకరిస్తవి. కుట్టుమిషనులు, సైకిళ్లు, బ్యాటరీలు, బోల్టులు, నట్లు, ఎలక్ట్రికల్ సామానులు, అగ్గిపెట్టెలు, పాదరక్షలు, తోలు సామానులు, యినుపసామగ్రి, కొయ్యసామానులు, కట్లరీ, ఆపరేషన్‌సామగ్రి, చిన్న మోటారు, గ్రాఫైట్ క్రూసిబుల్సు, స్టోన్‌వేర్ పైపులు, పింగాణీ వస్తువులు, ఫౌంటెన్‌పెన్నులు, ప్రొజెక్టర్లు, రేడియోలు, రేడియో విడిభాగాలు మొదలగు కొద్దిపాటి యింజనీరింగు సరుకుల ఉత్పత్తి అభివృద్ధి

నిమిత్తమై పరిశ్రమలశాఖ కొన్ని పథకాలను ప్రారంభించింది. రూ. 313.44 లక్షల ఖర్చుతో లఘు పరిశ్రమలను అభివృద్ధిపరచడానికై ప్రభుత్వం దాదాపు 60 పథకాలను తలపెట్టింది.

## పారిశ్రామిక ఎస్టేట్లు

శ్రీ దామోదర రావు:- నరసింహారావుగారూ, మరి లఘుపరిశ్రమల విషయంలో పారిశ్రామిక ఎస్టేట్ల కార్యక్రమమేమిటో తెలుపుతారా? సనత్ నగర్, విశాఖపట్టణం, విజయవాడ, సామర్లకోట, నంద్యాల, వరంగల్లు మొదలగుచోట్ల పారిశ్రామిక ఎస్టేట్లు నెలకొల్పబడనున్నవని తెలిసింది.

శ్రీ నరసింహారావు:- ఆంధ్రప్రదేశ్‌లో రెండవ పంచవర్ష ప్రణాళికలో పారిశ్రామిక ఎస్టేట్లను నెలకొల్పడానికై రూ. 97 లక్షలు కేటాయింపబడ్డవి. కర్మాగారాలకు మంచి స్థలాలను లభింపజేయడం, విద్యుచ్ఛక్తి, నీరు, గ్యాసు, ఆవిరి, కంప్రెస్డ్ ఎయిర్, రైల్వేసైడింగ్, కాపలాజవానులు మొదలగు సౌకర్యాలన్నిటినీ తక్కువ ఖర్చుతో లఘుపరిశ్రమలకు లభింపజేయడం పారిశ్రామిక ఎస్టేట్ల ముఖ్యోద్దేశం. లఘుపరిశ్రమలన్నీ యీ ఎస్టేట్లలో ఒకదాని సరసన మరొకటి వుంటాయి గనుక వేటికవి స్వతంత్రంగా వుంటూనే ఒకదానికొకటి సహాయకరంగావుంటాయి. ఇలా అన్ని పరిశ్రమలకూ ప్రయోజనం కలుగుతుంది.

శ్రీ కృష్ణ:- బాగావుంది. మరి చేతిపనివారలకు పనులు కల్పించడానికి సహకారకార్య కేంద్రాలనూ, తక్కువ ఆదాయంగల కుటుంబాలవారికి చేతినిండా పనికల్పించడానికి అగ్గిపెట్టెల ఫ్యాక్టరీలనూ ప్రభుత్వం ఏర్పాటుచేస్తూవుందని తెలుస్తూ వుంది. వాటివివరాలు చెప్పండి.

శ్రీ నరసింహారావు:- అవును కృష్ణగారూ. 20 సహకారకార్యకేంద్రాలు నెలకొల్పబడ్డవి. వాటిలో 400 మంది పనివారలకు పనులు దొరికాయి. నాలుగు అగ్గిపెట్టెల ఫ్యాక్టరీలలో దాదాపు 1500 మంది స్త్రీలకు పనులు దొరుకుతున్నవి.

## పీచు పరిశ్రమ

శ్రీ దామోదరరావు:- ఆంధ్రప్రదేశ్‌లో పీచు పరిశ్రమను అభివృద్ధిపరచడానికి అవకాశాలేమైనా వున్నాయంటారా?

శ్రీ నరసింహారావు:- కోస్తాజిల్లాలలో యీ పరిశ్రమ అభివృద్ధికి మంచి అవకాశాలున్నాయి. బారువలో పీచుపరిశ్రమ పాఠశాలవుంది. అంతర్వేది, మొగల్తుర్రు, తాళ్ళరేవులలో శిక్షణ-ఉత్పత్తి కేంద్రాలు నెలకొల్పబడినవి. రెండవ ప్రణాళికలో పీచుపరిశ్రమాభివృద్ధికి రూ. 4 లక్షలు కేటాయింపబడ్డవి.

శ్రీ కృష్ణ:- మన మన ఆంధ్రప్రదేశ్ చేతిపరిశ్రమలు మనకు గర్వకారణమైనవనీ, మనసంస్కృతి సంప్రదాయాలను అవి ప్రతిబింబాలనీ అంటారు. నిజంగా కొన్నిశతాబ్దాల అనుభవం మీదట ప్రయోగం చేసిన పరిశ్రమలు యింత నాగసుగా రూపొందాయని అనుకుంటాను. వీటిమాటేమిటి?

శ్రీ నరసింహారావు:- ఆంధ్రప్రదేశ్ పారిశ్రామికాభివృద్ధిలో చేతిపరిశ్రమలకు ముఖ్యస్థానమున్నది. వీటికోసమై ప్రణాళికలో రూ. 35.05 లక్షలు కేటాయింపబడినవి.

ఇప్పటికే కొంతపని జరిగింది. ముఖ్యమైన పథకాలు అమలుజరుగుతూవున్నవి. చేతిపనివారల సహకార సంఘాలు ఏర్పాటు చేయబడుతున్నవి. వాటి ఏర్పాటుకుగాను ఆరంభదశలో పెట్టుబడి ధనానికీ మేనేజిమెంటు ఖర్చులకూ ఆర్థికసహాయం చేయబడుతున్నది. ఈ సంఘాలు ఉత్పత్తి పనిని ప్రారంభించాయి. పనివారలకు విడువకుండా పనులు దొరుకుతున్నవి. ప్రస్తుతం రూ. 8.45 లక్షలఖర్చుతో మరి 14 పథకాలను అమలు జరుపవలెనని ప్రభుత్వం ఆలోచిస్తూవుంది. ఈ పథకాలలో డిజైనులు కేంద్ర సంస్థాపన, పనివారలకు గృహావసతి మొదలైనవి కూడా వున్నాయి. హైదారాబాదు, విజయవాడలలోవున్న ప్రభుత్వ కుటీరపరిశ్రమల విక్రయశాలలను విస్తృతంచేసి, మార్కెటింగు సమస్యను పరిష్కరించడానికై ఒక పథకం తలపెట్టబడింది.

ఆంధ్రప్రదేశ్‌కు చేతిపరిశ్రమల సలహా సంఘం ఏర్పాటు చేయబడింది.

## పట్టు పరిశ్రమ

శ్రీ దామోదరరావు:- ఆంధ్రప్రదేశ్‌లో పట్టు పరిశ్రమాభివృద్ధికి ఏమైనా అవకాశాలున్నయ్యాంటారా? వుంటే తగిన ప్రాంతాలేవి?

శ్రీ నరసింహారావు:- ఆంధ్రప్రదేశ్‌లో పట్టుపరిశ్రమ యింకా శైశవావస్థలోనేవున్నా, దీని అభివృద్ధికి మంచి అవకాశాలున్నాయి. సెరికల్చర్ టస్సార్ పరిశ్రమకు అవకాశాలు బాగానేవున్నాయి. చిత్తూరుజిల్లాలోని పలమనేరు, అనంతపురంజిల్లాలోని హిందూపురం, విశాఖపట్టణంజిల్లాలోని అరకులోయ, చింతపల్లి, కరీంనగరు జిల్లాలోని మానేరు, వరంగలు జిల్లాలోని ములుగు పట్టుపరిశ్రమ విషయంలో అనుకూల స్థితిలోవున్నవి. మహబూబ్‌నగర్, కర్నూలు, నల్లగొండజిల్లాలలో సెరికల్చర్‌కు అవకాశాలున్నవి. ములుగు, మంథెన, మహదేవపురం, వెంకటాపురం ప్రాంతాలలో టస్సార్ పరిశ్రమవుంది.

2,000 ఎకరాలలో మల్బరీచెట్లు వేయవలెనని తలపెట్టబడింది. ఇందువల్ల 1500 కుటుంబాలకు మేలుకలుగుతుంది. రూ. 21.38 లక్షలు ఖర్చుఅయ్యే పథకాలు రెండవ ప్రణాళికలో చేర్చబడినవి.

శ్రీ దామోదరరావు:- యీ చర్యలన్నింటివల్ల లఘుపరిశ్రమలకు, చేతిపరిశ్రమలకు, పట్టుపరిశ్రమకు దోహదం కలుగుతుందనడంలో సందేహం లేదు. మరి ఖాదీగ్రామీణ పరిశ్రమలకూ, సామాజికాభివృద్ధి కేంద్రాలలో గ్రామీణ చేతిపరిశ్రమలకూ, కళలకూ ఏదో కార్యక్రమం వుందనుకుంటాను.

శ్రీ నరసింహారావు:- ఖాదీపరిశ్రమకూ, ఇతర గ్రామీణ పరిశ్రమలకూ ఆంధ్రప్రదేశ్ ప్రసిద్ధిజెందినది. అఖిలభారత ఖాదీగ్రామీణ పరిశ్రమలబోర్డు వారు నూనెగానుగల పరిశ్రమకూ, ఆహారేతర తైలములతో సబ్బుల తయారీకీ, తేనెపట్టుల పెంపకానికి, తోళ్ళపరిశ్రమకూ, బెల్లం, కలకండ పరిశ్రమకూ, దంపుడుబియ్యం పరిశ్రమకూ ఆర్థిక సహాయం చేస్తున్నారు. ప్రస్తుతసంవత్సరం ఆంధ్రప్రదేశ్‌లో 12,000 అంబర్‌చర్ఖాలను ప్రవేశపెట్టవలెనని తలపెట్టబడింది. ఇదివరకే పలుతావుల అంబర్‌చర్ఖాకేంద్రాలు నెలకొల్పబడ్డవి. అనేక ప్రాంతాలలో మట్టిపాత్రల తయారీ పరిశ్రమ అభివృద్ధి పరచబడుతున్నది.

ఆంధ్రప్రదేశ్‌లో 41 సామాజికాభివృద్ధి కేంద్రాలు, 63 జాతీయవికాస కేంద్రాలువున్నవి. ఈ ప్రాంతాలలో లఘు, కుటీరపరిశ్రమలను అభివృద్ధి పరచడానికి తీవ్రప్రయత్నాలు చేయబడుతున్నవి. అందుకొరకై గ్రామీణ కళలు, చేతి పరిశ్రమల కేంద్రాలు నెలకొల్పబడగలవు. ఇంకా వివిధ పథకాలుకూడా అమలు జరుపబడుతాయి. ములుగులో ఒకటి, సామర్లకోటలో ఒకటి - మొత్తం రెండు మార్గదర్శక కార్యక్రమాలు అమలుజరుగుతూవున్నాయి.

(పి. ఐ. ఆర్. సౌజన్యంతో)



# ఎరువుల తయారీకి స్థానికాధారముల వినియోగము

శ్రీ యం. యస్. శివరామన్, ఐ. సి. యస్.

(ప్లానింగ్ కమీషన్ సలహాదారు)

ఇంతవరకూ నేను భారతదేశ భూములలో నత్రజని కొరత సమస్యను, ఆ సమస్యను తక్కువ వర్షపాతంగల ప్రాంతాలలో తప్ప ఇతర భూములలో ఎలా పరిష్కరించవలసిందీ నివేదించాను. రైతులు అవలంబించవలసిన పద్ధతులు ఎప్పుడూ కడుసామాన్యంగా ఖర్చు ఎక్కువలేకుండా ఉండాలి. ఈపద్ధతులను రైతులు అనుసరించేట్టు చేయాలంటే మొదట ప్రభుత్వ వ్యవసాయక్షేత్రం దాన్ని చేసి చూపాలి. ప్రతిక్షేత్ర నిర్వాహకులు ఆక్షేత్రంలో పెరిగిన మొక్కలతో చీకుడుఎరువు (కంపోస్టు) ను తయారుచేయాలి. పచ్చిఆకు ఎరువు విత్తనాలనువేసి వన్యజాతి చెట్లను మొలిపించి తద్వారా ఆ క్షేత్రానికి సరిపోయే పచ్చిఆకు ఎరువును, ఇతర సేంద్రియపు ఎరువులను తయారుచేసుకోవాలి. ప్రస్తుతం అనేక ప్రభుత్వ క్షేత్రాలు తమకు తక్కువపడిన సేంద్రియపుఎరువులను ఇతరులవద్దనుంచి కొనుక్కొంటున్నవి. పెరటి ఎరువును, కంపోస్టు ఎరువును, సారవంతమైన మట్టిని పచ్చిఆకు ఎరువును సైతం ఇతరులవద్దనుంచికొని ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలకు ఉపయోగించడం జరుగుతున్నది. ఇది ఎరువుల తయారీకి స్థానికాధారాలను వినియోగించుకోండని రాష్ట్రప్రభుత్వాల వ్యవసాయశాఖలు రైతాంగంలో చేస్తూవున్న ప్రచారానికి విఘాతం కలిగిస్తుంది. ఒకవైపు రైతులకు స్థానికంగా ఎరువులను తయారు చేసుకోవలసిందిగా బోధచేస్తూ, మరొకవైపు ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలు తాము చెప్పేది ఆచరించనప్పుడు రైతులుకూడా వ్యవసాయశాఖ ప్రచారాన్ని పట్టించుకోరు. కనుక ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలన్నీ రెండు మూడేండ్లలోపల తమకు అవసరమైన పచ్చిఆకు ఎరువు విత్తనాలనూ, సేంద్రియపు ఎరువులనూ తయారు చేసుకోవలెనని ప్రభుత్వం కట్టడి చెయ్యాలి. ప్రభుత్వ క్షేత్రాలలో నూనెపిట్టు వాడకాన్ని సాధ్యమైనంతవరకు తగ్గించాలి. నూనెపిట్టు వల్ల భూములకు ఎంత నత్రజని లభిస్తుందో ప్రయోగాలుచేసి చూచేపనులకు మాత్రమే నూనెపిట్టును ఉపయోగించాలి. ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాల ఉద్యోగులు ఆక్షేత్రంలోపండే సాధారణ పంటలకు ఏమాత్రం దెబ్బతగలకుండా దానికవసరమైన సేంద్రియపు ఎరువుల విషయంలో స్వయంసమృద్ధతను సాధించడానికి తమశక్తియుక్తులన్నీ వినియోగించి పనిచేయాలి. ఇందుకొరకై ప్రయోగచర్యలకు లేదా పరిశోధనకవసరమైన ఇతర కార్యాలకు వినియోగింపబడునట్టి క్షేత్రభాగములలో ఆక్షేత్రమునకవసరమైన వన్యజాతులను పెంచాలి. మద్రాసు రాష్ట్రంలో 1951 నుంచి 1954 వరకు ప్రభుత్వ వ్యవసాయ పరిశోధన, ప్రయోగ, ప్రదర్శక క్షేత్రాలన్నీ పైకొన్నచర్యల ఫలితంగా ఆక్షేత్రాలలోని సాధారణపైరులకు ఏమాత్రం నష్టం కలుగకుండానే నీటికట్టుతోనూ, నీటికట్టులేకనూ సాగయ్యే క్షేత్ర భూములన్నిటికీ అవసరమైన సేంద్రియపు ఎరువులను సరఫరా చేయగలుగుతున్నవి.

ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రం ప్రతిదీ సేంద్రియపు ఎరువుల విషయంలో స్వయంసమృద్ధమై ఉండవలెనని నిర్దేశించాలి. అయితే అలాంటి స్వయంసమృద్ధత సాధింపబడేటంతవరకూ రైతులు పచ్చి ఆకుఎరువును, గ్రామీణచీకుడు ఎరువును తయారు చేసే విషయంలో అనుకూలమైన వాతావరణం కలిగించే పనిని నిలుపుదలచేయనక్కరలేదు. ప్రతి గ్రామంలోనూ క్రమబద్ధమైన ప్రచారంద్వారా యీ ఎరువుల తయారీవిషయంలో రైతులకు ప్రబోధం చెయ్యాలి. గ్రామీణులు గుమికూడునట్టి ఉత్సవాలు, జాతరలు, మేళాల సందర్భంలో యీ ప్రచారం ఎక్కువగా జరగాలి. ఈ విషయంలో గ్రామసేవకుడు నిర్వహించవలసినపాత్ర అతిముఖ్యమైనది. అతడు ప్రచార సభలను ఏర్పాటుచేయాలి. వ్యవసాయదారులను వ్యక్తిగతంగా కలుసుకొని వారికి విత్తనాల ప్యాకెట్లనిచ్చి వాటితో వారికవసరమైన పచ్చిఆకుఎరువు విత్తనాలను, ఎరువునూ తయారు చేసుకోమని చెప్పాలి. ఈపనిలో అతడు గ్రామ పంచాయితీ, గ్రామ సహకారసంస్థలు, గ్రామపాఠశాల ఉపాధ్యాయులు, గ్రామాధికారులు, గ్రామ ప్రముఖుల సహాయ సహకారాలు పొందాలి. స్థానికంగా పలుకుబడిగల ప్రతివ్యక్తికీ పచ్చిఆకుఎరువు విత్తనాల ప్యాకెట్లనిచ్చి వాటిని పంపిణీచేయవలసిందిగా కోరాలి. ఈవిధంగా పొలాలగట్లపై పచ్చిఆకు విత్తనాల ఉత్పత్తి నిమిత్తం వన్యజాతులచెట్లు పెంచబడునట్లు శ్రద్ధవహించాలి. రెండేండ్లలోపల గ్రామానికి అవసరమైన పచ్చి ఆకు ఎరువును ఆ గ్రామ పొలాలలోనే ఉత్పత్తి చేయుటకై గ్రామ పంచాయతీ ఒక నిర్దిష్ట కార్యక్రమాన్ని సిద్ధంచేయాలి గ్రామంలో ఏయే పొలాలకు ఏయే పచ్చిఆకు ఎరువుమొక్కలు తగినవో ఆజాబితాను గ్రామసేవకుడు తయారుచేయాలి. ఎన్ని విత్తనాలు, ఎన్ని అంటుకొమ్మలు అవసరమో వాటిని అంచెనా వెయ్యాలి. వాటిని ఉత్పత్తిచేయుడానికవసరమైన బీజమూలములు, అంటుకొమ్మలు ఖరీఫ్ తరుణం ఆరంభసమయానికల్లా రైతులకు అందునట్లుగా సకాలంలో తగుచర్యలు తీసుకోవాలి. శాశ్వతంగా వన్యజాతులను పెంచేవిషయంలోను, పచ్చిఆకు ఎరువు విత్తనాలను సేకరించి వాటితో తమభూములలో పచ్చిఆకు ఎరువురొట్టను పండించేవిషయంలోను, ఇంకా తమవద్ద మిగిలిన విత్తనాలను తరువాత వచ్చేతరుణంలో పొలాలగట్లపైచల్లి గ్రామంలో సేద్యంచేయబడేమొత్తం భూమికి పచ్చిఆకు ఎరువు విత్తనాలు, ఎరువు లభించునట్లుచేసేవిషయంలోనూ రైతులలో శ్రద్ధాసక్తులు కలిగించి, వారుదీన్ని అత్యవసరపనిగా భావించునట్లు చెయ్యాలి.

భారతదేశంలోని అనేక ప్రాంతాలలో సంప్రదాయసిద్ధంగా వ్యవసాయంచేస్తూ వస్తున్నవారికి పచ్చిఆకుఎరువుయొక్క విలువ ఏమిటో తెలుసు. అందుచేత దాని ప్రయోజనాలేమిటో రైతులకు ప్రదర్శించిచూపనక్కరలేదు. అయితే అట్టి ప్రదర్శనాలు అవసరమైనచోట్ల గ్రామసేవకుడు వాటిని ఏర్పాటుచేసి, రైతులకు సంగతి సందర్భాలు తెలియపరచాలి. ఈ పద్ధతిని అవలంబించడానికి ముందు వెనుకాడుతున్న రైతులను తీసుకవెళ్ళి వన్యజాతులను, పచ్చిఆకుఎరువు మొక్కలను పెంచడం, విత్తనాలు ఎరువులను ఉత్పత్తిచేయడం, తద్వారా ఈ ఎరువుల విషయంలో పొలాన్ని స్వయంసమృద్ధం చేయడంవంటి పనులను చూపెట్టాలి. పైరులు పెరుగుతున్న సమయంలోను, పంటకోతల సమయంలోను పచ్చిఆకు ఎరువును పొలములో వేసినందువల్ల కలిగే ఫలితాలనుకూడా వారికిచూపెట్టాలి. గ్రామసేవకుడు వ్యవసాయదారులను ఒకచోట చేర్చి వారిచేత యీవిషయమై చర్చలు జరిపించాలి. అప్పుడు పచ్చిఆకుఎరువులనుఉపయోగించి సత్ఫలితాలను పొందినట్టి వ్యవసాయదార్లు వివరించిన అనుభవాలవల్ల వెనుకబడివున్న రైతులు లాభం పొందడానికి వీలుంటుంది.

ఈ ఉద్యమంలో ఒకభాగంగా బావులున్నచోట్ల లేదా నీటికట్టుకు వేరే సదుపాయం ఉన్నచోట్ల ధ్యాంచా (ఒకరకపు జీలుగ), ముండ్లులేనట్టి జీలుగ వంటిరకాల మొక్కలతోటలనువేయడం మంచిది. ఇటువంటి విషయాలలో వ్యవసాయమంటే శ్రద్ధాసక్తులుగల రైతులు ఉచితంగా భూమియిచ్చి, ప్రతిఫలంఆశించకుండా కాయకష్టంచేసి ఎక్స్‌టెన్షన్ కార్యకర్తలకు తోడ్పడుతూ ఉంటారు. మొక్కల

తోటల్లో మే లేక జూన్ నెలలో విత్తనాలు వేయ వచ్చు. ఖరీఫ్ పైరు వేయడంతోటే పాఠశాలల పిల్లలు, ఉత్సాహంగల రైతుల స్వచ్ఛందసహకారంతో పొలాలగట్లపైన ఆమొక్కలను నాటాలి. గ్రామ పంచాయితీగాని లేక సహకార సంఘం గాని లేనిచోట్ల ఇందునిమిత్తమై గ్రామ వ్యవసాయదార్ల సంఘాలను ఏర్పాటుచెయ్యాలి. ఆసంఘాలు యీ ఉద్యమాన్ని వ్యాప్తంచేయడానికి ప్రత్యేకంగా కృషిచేస్తాయి. ఇటువంటిచర్యలు పైకొన్న ఫలితంగా మద్రాసురాష్ట్రంలోని తంజావూరుజిల్లాలో అన్ని ప్రాంతాలలోనూ 1955 సంవత్సరంవరకల్లా ముండ్లులేని జీలుగరకాన్ని పదిలక్షల ఎకరాలలో వ్యాప్తంచేయడం సాధ్యమైంది. అంతకు మూడేండ్ల క్రితం చాలామంది వ్యవసాయదార్లకు అటువంటి మొక్క ఒకటి వుంటుందన్న సంగతే తెలియదు.

భారతదేశ వ్యవసాయదార్లు తమవృత్తిలో తెలివితేటలుగలవారు. ఆచరణసాధ్యమైన సూచన ఒకటి చేస్తేచాలు, వారు వెంటనే దాన్ని అవలంబించి వ్యాప్తంచేయడానికి సంసిద్ధులవుతారు. కనుక ఎరువుల ఉత్పత్తికి స్థానికాధారముల వినియోగించదగు మార్గాలను వారికి చెబితేచాలు, దాన్ని సత్వరంగా పెంపొందజేస్తారు. ఈవిషయంలో రాష్ట్రప్రభుత్వాల వ్యవసాయశాఖలు చొరవచేసుకొని ఒక్కొక్క తరహాభూమికి వివిధరకాల పచ్చిఆకురొట్ట విత్తనాలను, పచ్చిఆకుఎరువులను ఉత్పత్తిచేయడానికై ఆధునిక పద్ధతులను ఆలోచించి, ఆపద్ధతులను వ్యవసాయదార్లలో ప్రచారంచెయ్యాలి.

పొలాలగట్లపైన, అంచులలోనూ, సేద్యానికి ఉపయోగింపబడని ఇతరస్థలాలలోను సంవత్సరం పొడుగునావుండే వన్యజాతులను, పొదలను పెంచడానికై గ్రామసేవకుడు సవివరంగా ఒక కార్యక్రమాన్ని సిద్ధంచెయ్యాలి. ఎక్కడ అవసరమో అక్కడ గ్రామీణ చీకుడుఎరువులను ఉత్పత్తిచేయడానికి ప్రతి వ్యవసాయదారునితో సంప్రదించిన మీదట ప్రతికమతానికి ఒక పథకం సిద్ధం చెయ్యాలి. సవరతీగ, మాద్రే ఒకరకపుజీలుగ మొదలగు శాశ్వత వన్యజాతులను పెంచవలసిందిగా వ్యవసాయదార్లకు నచ్చచెప్పాలి. ఈమొక్కలను ఏ కట్టలపైపెంచవలెనో ముందుగానే ఎన్నికచేసి వుంచుకొనవలసిందిగా వ్యవసాయదార్లను ప్రోత్సహించాలి. ఇందు కొరకు కాలిబాటలను, పొలాలగట్లను, అంచులను, కాలువగట్టులను ఎన్నిక చేయవచ్చు. అవసరమైన విత్తనాలను గ్రామీణ సేవకుడుముందుగానే సంపాదించి వుంచుకోవాలి. వేసవిలో నీటికట్టుసాధ్యమైన చోట్ల నీలి, జీలుగ, మాద్రే జాతుల మొక్కలను సకాలంలో పెంచాలి. అలా సకాలంలో పెంచినట్లయితే తొలకరివరకల్లా 8 అంగుళాలు మొదలు 12 అంగుళాల ఎత్తుగల మొక్కలు నాటుకు లభ్యమవుతాయి. సవరతీగ, మాద్రే అంటుకొమ్మలను వర్షం కురవడంతోటే నాటాలి. కాని మాద్రేవల్ల సత్ఫలితం పొందాలంటే తొలకరికి కనీసం రెండు నెలలు ముందైనా అంటుకొమ్మలను మొక్కలతోటలోవేసి వర్షాలు కురిసిన తరువాత తిరిగి నాటాలి. అవసరమైన పచ్చిఆకురొట్టను లభింపజేసే స్థానికములైన ఇతర మొక్కలపెంపకాన్నికూడా ప్రోత్సహించాలి. వ్యవసాయదారునికి అవసరమైనప్పుడు అక్కడికక్కడే ఎకరానికి 4,000 పౌనుల పచ్చి ఆకుఎరువును లభింపజేయడం యీ ఉద్యమలక్ష్యం కావాలి.

సంవత్సరం పొడుగునా వుండేటువంటి పొదలను పొలాలచుట్టూ పెంచడం మంచిది. అలాంటిపొదలు పశువులు పొలాలలోకివచ్చి పైరును తినకుండా కంచెగా ఉపకరిస్తాయి. సవరతీగ పొదనువేయవచ్చు. దీనిని మేకలు, ఇతర పశువులు తినవు. ఈతీగెజాతిని అన్నిచోట్ల వ్యాప్తం చేయడానికి కృషిజరగాలి. ఒరిస్సారాష్ట్రంలోని కొన్నిప్రాంతాలలో రైతులు పొలంచుట్టూ కంచెగా సవరతీగె పొదను పెంచుతారు. యీపద్ధతిని దేశమంతటా వ్యాప్తించేయడం మంచిది. వర్షాలు కురవకపోయినా లేక ఎక్కువ కాలం నీరునిలిచివున్నాకూడా సవరతీగె నశించకుండా నిలువగలుగుతుంది. 6 మొదలు 8 అడుగుల పొడవుగల మాద్రే మొద్దులనుకూడా నాటడం మంచిది. అలాంటిమొద్దులు లభించకపోయినట్లయితే మొక్కలమళ్ళల్లో చిన్నచిన్న కొమ్మలనునాటి వాటిని సంవత్సరంవరకు పెరగనివ్వడం మంచిది.

గ్రామాభివృద్ధి కార్యక్రమంలో స్వయం

సహాయం, ఆత్మవిశ్వాసం ముఖ్యమైనవి. వ్యవసాయంలోకూడా స్వయంసహాయం, ఆత్మవిశ్వాసం స్వతంత్రకృషి ముఖ్యమైన పాత్రవహిస్తాయి. ఏదేని ఒకసమస్యకు పరిష్కారమార్గం లభించినట్లయితే దాన్ని అమలుజరిపే పద్ధతిని గ్రామసేవకుని శక్తి యుక్తులకు వదలివెయ్యాలి. గ్రామసేవకుడు అతని ప్రయత్నంలో కృతకృత్యుడవుతాడా లేదా అన్నది రైతులకు అతను నచ్చచెప్పడంలోనూ, క్రమబద్ధమైన ఒక పథకం ప్రకారంముందుగానే విత్తనాలు, మొక్కలు మొదలగువాటిని సమకూర్చుకోవడం పైననూ ఆధారపడి ఉంటుంది. కొంచెం శ్రమపడి ఒక పద్ధతిప్రకారంగనుక కృషి చేసినట్లయితే రెండేండ్లలోపల పొలానికి కావలసిన సేంద్రియపు ఎరువు లభించగలదనీ, దానివల్ల సేద్యపు ఖర్చులు తగ్గడమేగాక పంటదిగుబడికూడా హెచ్చగలదని గ్రామసేవకుడు రైతులకు వివరించిచెప్పాలి. దీని ప్రయోజనాన్ని రైతులు, వ్యవసాయదారులు గ్రహించినప్పుడు యీ ఉద్యమంవల్ల దేశ వ్యవసాయం ఎంతో అభివృద్ధి చెందుతుంది.



# రహదార్ల నిర్మాణ కార్యక్రమ వివరాలు

"మంచి బాటలు వుండుటవలన ప్రజలు సర్వసమానంగా ఐక్యతా భావంతో అభివృద్ధి చెందుటకు వీలున్నదా లేక జట్లు జట్లుగా ఎవరికి వారే దూరంగా వుంటూ జీవనం గడుపుతారా అనే విషయం బోధ పడుతుందని నేను భావిస్తాను. బాట విషయమై ఇట్టి సాంఘిక సాంస్కృతికదృక్పథం వుండడం ఆర్థిక దృక్పథానికంటే ఏమాత్రం తీసిపోదు. బాటలగుండా మానవులు మాత్రమేకాదు ప్రయాణం చేసేది. వివిధ వస్తు సామగ్రి మాత్రమేకాదు రవాణా అయ్యేది. సంఘ ప్రజలందరూ కలసి మెలసి వుండుట వలన భావాలుకూడా ఒక చోటినుంచి మరోచోటికి ప్రయాణమవుతాయి. బాటల వల్లనే ఇవి సాధ్యపడుతున్నవి."

*1958 జనవరి 5వ తేదీన న్యూఢిల్లీలో ఇండియన్ రోడ్స్ కాంగ్రెసు యొక్క 22వ మహాసభకు ప్రారంభోత్సవం జరుపుతూ రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్ అన్న మాటలు.*

1957-58 సంవత్సరంలో రోడ్ల అభివృద్ధికై రూ. 118.83 లక్షలు (ఆంధ్ర ప్రాంతానికి రూ. 79.21 లక్షలు, తెలంగాణా ప్రాంతానికి రూ. 39.62 లక్షలు) కేటాయించ బడినవి. ఈ ఖర్చంతా ప్రభుత్వమే భరిస్తుంది. పథకముల వివరములు దిగువ పేర్కొన బడినవి:—

## ఆంధ్రప్రాంతం

### రాష్ట్రరోడ్లు కొత్తవాటి నిర్మాణం

ఈ పథకంక్రింద 9 మైళ్ళ పొడవున రోడ్లు 6 మైళ్ళ మెటల్ రోడ్డు, 62.4 మైళ్ళపొడవున రోడ్లకు నల్లటాపు వేయుట, మున్నగు పనులకై రూ. 16.44 లక్షలు కేటాయించ బడినవి. ఈ మొత్తంలో క్రొత్త వంతెనలకయ్యే ఖర్చు రూ. 4.35 లక్షలు. పాతవంతెనల అభివృద్ధికయ్యే ఖర్చు రూ. 0.35 లక్షలు చేరియున్నవి.

### రోడ్ల నిర్వహణ

1956-57 సంవత్సరంలో 268 మైళ్ళ జిల్లా బోర్డు రోడ్డులు ప్రభుత్వ అధ్వర్యానికి మార్చ బడినవి. 1957-58 సంవత్సరంలో 192 మైళ్ళ రోడ్లను స్వాధీన పరచుకొనుటకు తలపెట్ట బడింది. ఈ రోడ్ల సక్రమ నిర్వహణకై రూ. 9 లక్షలు కేటాయించ బడినవి.

### బాటలు

బాటసారుల సౌకర్యార్థం వేయబడిన రోడ్లలో మిగిలిపోయిన పనిని పూర్తిచేయుటకు రూ. 0.70 లక్షలూ, క్రొత్తవాటిని అభివృద్ది పరచుటకు రూ. 10 వేలు మంజూరు చేయబడినవి.

### ఇతర రోడ్లు

ఈ పథకంక్రింద ఆంధ్రప్రాంతంలో అసంపూర్ణంగా మిగిలిపోయిన రోడ్లను పూర్తిచేయుటకై

11 జిల్లాబోర్డులకు డబ్బు మంజూరైంది. వివరములు ఇవి:-

1. శ్రీకాకుళం (రూ. 2,01,600)
2. విశాఖపట్నం (రూ. 20,150)
3. తూర్పు గోదావరి (రూ. 40,350)
4. పశ్చిమ గోదావరి (రూ. 80,700)
5. గుంటూరు (రూ. 6,08,000)
6. కృష్ణా (రూ. 40,300)
7. నెల్లూరు (రూ. 1,33,200)
8. చిత్తూరు (రూ. 47,050)
9. కడప (రూ. 13,500)
10. అనంతపూరు (రూ. 40,350)
11. కర్నూలు (రూ. 1,74,800).

## ఇతరరోడ్లు (క్రొత్తవాటి నిర్మాణం)

ఈ పథకం ప్రకారం క్రొత్తరోడ్లు వేయుటకు జిల్లాబోర్డులకు డబ్బు మంజూరు చేయబడుతుంది. జిల్లా బోర్డులు, రోడ్లవల్ల లాభం పొందువారు ఎంత డబ్బు గ్రాంటు ఇవ్వబడుతుందో అంతడబ్బును విరాళంగా ఇవ్వాల్సి వుంటుంది. ఈ సంవత్సరానికి తగినంత విరాళాలు వచ్చినట్లయితే, జిల్లాబోర్డులకు రూ. 1.50 లక్షలు మంజూరు చేయబడుతాయి.

## యంత్రాలు, పరికరాలు

రోడ్డు పనులను సమర్థవంతంగాను, సకాలంలోను పూర్తి చేయాలంటే హైడ్రాలిక్ జాక్స్, వైబ్రేటర్లు, గొట్టాలు, ఇంజనులు మున్నగునవి అవసరమవుతాయి. అందుకై రూ. 7.10 లక్షలు కేటాయించ బడినవి.

## జాతీయ రహదార్లు

గౌతమీ నదిపైన వంతెన కట్టించడానికి అదనంగా ఖర్చు తగిలినందువల్ల రూ. 10 లక్షలు, గౌతమీ, వసిష్ఠ నదులపైన నిర్మించే వంతెనల కయ్యే ఖర్చులో ఎనిమిదో వంతును భరించుటకు రాష్ట్ర ప్రభుత్వ మంగీకరించింది. మద్రాసు, కలకత్తా రోడ్డు (జాతీయ రహదారి నెం. 5) డైవర్షన్‌కుఅయ్యే ఖర్చులోకూడ కొంత భాగాన్ని రాష్ట్ర ప్రభుత్వం భరిస్తుంది. ఇదుకై రాష్ట్ర ప్రభుత్వం 1957-58 సంవత్సరానికి రూ. 5.12 లక్షలు కేటాయించింది.

## గ్రామరోడ్ల నిర్మాణం

గ్రామరోడ్లు, అడ్డదారులు, వంతెనలు మున్నగువాటి నిర్మించుటకై కొన్ని గ్రామ పథకములు రూపొందించ బడినవి. ఈ పథకాలను అమలు పరచుటకై జిల్లాలకు బ్లాకు గ్రాంట్లు క్రింద రూ. 12.50 లక్షలు ఇవ్వబడుతాయి. ఈ రోడ్ల నుంచి లాభంపొందే గ్రామాలనుంచి తగిన విరాళాలు వచ్చినట్లయితే, అక్కడ రోడ్లు వేయబడుతాయి. ఈ పద్ధతి ప్రకారం యెక్కడ రోడ్లు వేయవలసిందీ, నిర్ణయించ బడుతుంది.

## యాత్రీకులను ఆకర్షించుట

యాత్రీకులను ఆకర్షించాలంటే ముఖ్యయాత్రా స్థలములలో వసతి, రవాణా, వినోద సౌకర్యాలు కల్పించడం చాల అవసరం. ముఖ్యంగా మారుమూలల్లో వున్న దర్శనీయమైన స్థలాలో ఇట్టి సౌకర్యాలు ముఖ్యంగా వుండాలి. 1957-58 సంవత్సరంలో శ్రీశైలం, మహానంది, ఎత్తిపోతల సింహాచెలములలో 4 ట్రావెలర్సు బంగ్లాలు నిర్మించుటకై రూ. 0.75 లక్షలు కేటాయించ బడినవి మహానందిలోని ట్రావెలర్సు బంగ్లా నిర్మాణం ఈ సంవత్సరం పూర్తి అవుతుంది.

# తెలంగాణాప్రాంతం

## మిగిలిపోయిన రోడ్లనిర్మాణం

మంజీరా నదిపైన కాజ్వే :- మెదకు పాపన్నపేట రోడ్డుదగ్గర మంజీరా నదిపైన ఒక వంతెన నిర్మించ బడుతున్నవి. ఈ వంతెన లేకపోతే మెదకు పాపన్నపేట రోడ్డు కొంతవరకు నిష్ప్రయోజన మైనట్లే. అందువల్ల ఈ వంతెన చాల ముఖ్యమైనది. దీనికి రూ. 6.26 లక్షలు ఖర్చు అవుతుందని అంచెనా. ఇందులో సగభాగం భారత ప్రభుత్వం భరిస్తుంది. ఈ అంచెనా మొత్తానికి భారత ప్రభుత్వ మంజూరీ ఆలస్యంగా వచ్చినందున వంతెనపై పని ప్రథమ పంచవర్ష ప్రణాళికలో ఆరంభం కాలేక పోయింది, గత

సంవత్సరమే పని ఆరంభమైంది. ఈ సంవత్సరం కూడా కొనసాగుతుంది. ప్రస్తుతానికి రూ. 1.43 లక్షలు కేటాయించ బడినవి.

## మక్తల్-నారాయిణపేటరోడ్డు

మహబూబునగరు జిల్లాలోని నారాయణపేట మక్తల్ రోడ్డులో వాగులపైన వంతెనలు లేక పోవడంవల్ల, వర్ష కాలంలో ప్రయాణీకులకు ఇబ్బంది కలుగుతున్నది. ఈ వాగులపైన వంతెనలు నిర్మించ బడుతాయి. ప్రతిపాదనలు అంతిమంగా తయారు కాకపోవడం వల్ల, ప్రథమ పంచవర్ష ప్రణాళికలో ఈ పనులు చేపట్టుటకు వీలు లేక పోయింది. వంతెన నిర్మాణాలకై 1957-58 సంవత్సరానికి ఒకలక్ష రూపాయలు కేటాయించ బడినవి.

## మరికలు-నారాయణపేట రోడ్డు

మహబూబునగరు జిల్లా మరికల్లు-నారాయణ పేట రోడ్డులోని వాగులపైన వంతెనలు వేయుటకు 1957-58 సంవత్సరానికి రూ. 50 వేలు మంజూరు చేయబడినవి.

## గండిపేట శంకరపల్లిరోడ్డు

ప్రథమ ప్రణాళికలో హైద్రాబాదు జిల్లాలోని శంకరపల్లి మార్కెటు కేంద్రాన్ని కలుపుతూ 14 మైళ్ళ రోడ్డు వేయుటకు పని ఆరంభించ బడింది. కేవలం ఆర్థికాభివృద్ధి దృష్ట్యా ఈ రోడ్డుపని ఆరంభించ బడింది. ఈ పనిని పూర్తిచేయుటకు రూ. 2.50 లక్షలు కేటాయించ బడినవి.

## వరంగల్లు-హనుమకొండ టౌన్‌రోడ్డు

వరంగల్ 2 1/2 మైళ్ళ పొడవునగల రోడ్డును సిమెంటు కాంక్రీటు చేయుటకు ఒకలక్ష రూపాయలు కేటాయించ బడినవి.

## పర్కాల-మహదేవపురం రోడు

ఇది 42 మైళ్ళ పొడువుగల రోడ్డు. కరీంనగరు జిల్లాలో వుంది. అడవిమార్గంగుండా పర్కాల, మహదేవపురం ప్రాంతాలను అభివృద్ధి పరిచే ఉద్దేశంతో ఈ పని ఆరంభించ బడింది. లోగడ కరువు నివారణ పనులక్రింద 15 మైళ్ళ రోడ్డు వేయబడింది. మిగిలిన 27 మైళ్ళ రోడ్డుపని ప్రథమ పంచవర్ష ప్రణాళిక కాలంలో ఆరంభించ బడింది. 1957-58 సంవత్సరంలో పనిని పూర్తిచేయుటకు ఒకలక్ష రూపాయలు కేటాయించ బడినవి.

## మహబూబునగరు-కోస్గిరోడు

ఈ పథకం ప్రకారం ఈ సంవత్సరంలో మహబూబునగరు కోస్గిల మధ్య రోడ్డుకు మెటల్ పని చేయబడుతుంది. అందుకై రూ. 0.50 లక్షలు కేటాయించ బడింది. ఈ రోడ్డుపైన రాకపోక లెక్కువ. ఇగి మెసూరు రాష్ట్రంలోని గుల్బర్గా వరకు వున్నది,

## అల్లదుర్గ-మెట్లకుంట రోడ్డు

అల్ల దుర్గ-మెట్ల కుంటరోడ్డు మెదకు జిల్లాలో వుంది. దీని పొడవు 27 మైళ్ళు. దేవనూరువద్ద మంజీరానది కడ్డంగా విద్యుచ్ఛక్తి నుత్పత్తి చేయు జలాశయాన్ని నిర్మించాలన్న ప్రతిపాదన ప్రకారం ఇర్రిగేషను ప్రాజెక్టు శాఖ ఈ పథకాన్ని చేపట్టింది. జలాశయ నిర్మాణం వాయిదా పడినందున రోడ్డుపని పూర్తిచేయు బాధ్యత హైవేస్ డిపార్టుమెంటుకు వప్పగించ బడింది. మొదటి భాగంలోని 11 మైళ్ళ రోడ్డు పూర్తి అయింది. మిగిలిన రెండు, మూడు భాగాలలోగల 16 మైళ రోడ్డుపని చురుకుగా కొనసాగు తున్నది. ఈ పని పూర్తి చేయుటకు 1957-58 సంవత్సరంలో రెండులక్షల రూపాయలు కేటాయించ బడినవి.

## మంజీరాపై హైలెవల్ కాజ్వే

అల్ల దుర్గ-మెట్ల కుంటరోడ్డు పైన ఇది నిర్మించ బడుతున్నది. ఇందుకయ్యే ఖర్చులో సగం (ఆరు లక్షల రూపాయలు) భారత ప్రభుత్వం భరిస్తుంది. వంతెన నిర్మాణం 1958-59 సంవత్సరంలో పూర్తి

అవుతుందని ఆశింపబడు తున్నది. ఈ సంవత్సరం పనిని కొనసాగించుటకు రూ. 0 887 లక్షలు కేటాయించ బడినవి.

## క్రొత్త రోడ్లు

ఈ క్రింద పేర్కొనబడిన 10 రోడ్ల నిర్మాణానికై 1957-58 సంవత్సరానికి మొత్తం రూ. 12 లక్షలు కేటాయించ బడినవి.

## సంగారెడ్డి నుంచి తూపర్నుకు రోడ్డు

మెదకుజిల్లాలో నర్సాపూరు మీదుగా ఈ రోడ్డు వేయబడింది. దీనిపొడవు 36 మైళ్ళు. ఈ రోడ్డు నిర్మాణంవల్ల ఆ ప్రాంతపు ఆర్థికాభివృద్ధికి దోహదం కలుగుతుంది. దాని నిర్మాణానికి రూ 23.40 లక్షలు అవుతుంది. ఈ సంవత్సరం పని ఆరంభించుటకు రూ. 75 లక్షలు కేటాయించ బడినవి.

## ప్రెగ్నాపురంనుంచి జగదేవపురానికి రోడ్డు

మెదకు నల్గొండ జిల్లాలమధ్య రాకపోకల సౌకర్యాలకు పెంపొందించే ఉద్దేశంతో ప్రెగ్నాపూరు నుంచి జగదేవపురానికి రూ. 6.50 లక్షల ఖర్చుతో 10 మైళ్ళ రోడ్డును వేయుటకు పథకం తయారు చేయబడింది. 1957-58 సంవత్సరానికి ఈ పనికై రూ. 0.75 లక్షలు కేటాయించ బడినవి.

## మన్ననూరునుంచి నిల్గంగకు రోడ్డు

ప్రస్తుతం మన్ననూరు ఫరహాబాదులమధ్య అటవీ శాఖ వేసిన ఫేర్వెదర్ రోడ్డుమాత్రమే వుంది. ఈ రోడ్డు పొడవు 14 మైళ్ళు. అక్కడినుంచి కృష్ణానది వరకు బండ్లమార్గ మొకటుంది. తెలంగాణా జిల్లాలోని కృష్ణానది అవతల శ్రీశైల యాత్రికు పోవాలంటే ఇదొకటేమార్గం. పూర్వ హైదరాబాదు ప్రభుత్వం భారత ప్రభుత్వంవారు కలసి ఈ మార్గాన్ని రూ. 17 లక్షల ఖర్చుతో జిల్లాబోర్డుగా అభివృద్ధి పరచుటకు ఒక పథకాన్ని మంజూరు చేశారు. ఈ ఖర్చులో మూడోవంతు రాష్ట్ర ప్రభుత్వం మిగిలిన ఖర్చు సెంట్రల్ రోడ్డు ఫండు అలొకేషన్, సెంట్రల్ రోడ్డు ఫండు ఆర్డినరీ రిజర్వు నుంచి చెరిసగం భరిస్తాయి. మూడు భాగాలుగా ఈ పని అంచెనా వేయబడింది. మొదటి భాగాన్ని భారత ప్రభుత్వం మంజూరు చేసింది. ఈ సంవత్సరమే పని ఆరంభ మవుతుంది. అందుకై రాష్ట్రి వాటాక్రింద రూ. 1.50 లక్షలు కేటాయించ బడినవి.

## హైదాబాదు-మల్లేపల్లి, పెద్దవూరు రోడ్డు

హైద్రాబాదు - మల్లేపల్లి - పెద్దవూగు రోడ్డు నాగార్జున సాగరు ప్రాజెక్టు వరకు వుంది. దీని పొడవు 76 మైళ్ళు. 36 మైళ్ళవరకు మాత్రమే మెటల్ రోడ్డు వుంది. రాకపోకల సౌకర్యాలను ఇంకా విస్తృత పరచే ఉద్దేశంతో ఈ రోడ్డును వెడల్పుచేసి, మెటలు, కంకర చేయుటకు తలపెట్ట బడింది. నల్లటాపు కూడా వేయాలని సంకల్పించ బడింది. భారత ప్రభుత్వంవారు అంచెనాలను ఇంత వరకు మంజూరుచేయక పోవడంవల్ల పని ఇంకా ఆరంభం కాలేదు. అయినా 1957-58 సంవత్సరానికి ఈ పథకానికై రూ. 3 లక్షలు కేటాయించ బడినవి.

## మహబూబాబాదునుంచి ఇల్లందుకు రోడ్డు

మహబూబాబాదు, ఇల్లందు వరుసగా వరంగల్, ఖమ్మం జిల్లాలోని తాలూకా కేంద్రాలు. వీటి మధ్య వూరు 24 మైళ్ళు. ఇదంతా అటవీ ప్రాంతం అడవుల్లోకి బాటకాని అంతర్జిల్లా రాకపోకల సౌకర్యాలను పెంపొందే దృష్టితో రెండవ పంచవర్ష ప్రణాళికలో రూ. 15.60 లక్షల ఖర్చుతో ఈ రోడ్డును నిర్మించుటకు సంకల్పించ బడింది. ఈ సంవత్సరం పని ఆరంభించుటకై ఒకలక్ష రూపాయలు కేటాయించ బడినవి.

## ఖమ్మంనుంచి ఇల్లందుకు రోడ్డు

ఖమ్మంనుంచి ఇల్లందుకు 28 మైళ్ళ దూరముంది. కరువు నివారక పనికై ఇదివరకు 9 మైళ్ళ కచ్చా రోడ్డు వేయబడింది. రెండవ ప్రణాళిక కాలంలో ఈ రోడ్డును అప్ గ్రేడు చేసి మిగిలిన భాగాన్ని జిల్లా

రోడ్డుగా మార్చాలని సంకల్పించ బడింది. దానికి ఖర్చు రూ. 16 లక్షలు అవుతుందని అంచెనా. ఈ సంవత్సరం పని ఆరంభించుటకై ఒకలక్ష రూపాయలు కేటాయించ బడినవి.

### వెంకటాపూరునుంచి మహదేవపూరు

మహదేవపూరు కరీంనగరులో ఒక తాలూకా కేంద్రం. మహదేవపురానికి పశ్చిమ భాగాన రోడ్డు లేకపోవడంవల్ల ఊరుకూ మంథని చెరువుకూ ఏలాంటి సంబంధం లేకుండా వుంది. అంతేగాకుండా ఈ రెండింటికీ మధ్య మానేరునది ప్రవహిస్తున్నది. అందుకని రెండవ పంచవర్ష ప్రణాళిక కాలంలో వెంకటాపూరునుంచి మహదేవపురానికి రూ. 9.75 లక్షల ఖర్చుతో 15 మైళ్ళ పొడవున జిల్లారోడ్డును, మానేరునదిపైన రూ. 6 లక్షల ఖర్చుతో ఒక హైలెవెల్ కాజ్వేకు నిర్మించాలని సంకల్పించ బడింది. ఈ విషయంలో తగు ప్లానులు అంచెనాలు తయారు చేయబడు తున్నవి. ఈ సంవత్సరం పని ఆరంభించుటకు లక్ష రూపాయలు కేటాయించ బడినవి.

### సిర్పూరుకు రోడ్డు

ఆదిలాబాదు జిల్లాలోని సిర్పూరు, కొత్తపేటలు పారిశ్రామిక కేంద్రాలు, ఇక్కడ సిర్పిల్కు ఫ్యాక్టరీ, పేపరు మిల్లులున్నాయి. ఈ రెండు పారిశ్రామిక కేంద్రాలను కలుపుతూ రోడ్డు సౌకర్యం కూడాలేదు. ఈ ప్రాంతంలో ఒకమంచి రోడ్డు అంటూ వుండటం ఎంతో అవసరం. అందుకని రూ. 11.70 లక్షల ఖర్చుతో 18 మైళ్ళ రోడ్డును వేయుటకు ఒక పథకం తయారు చేయబడింది. ఈ సంవత్సరమే పని మొదలు పెట్టుటకు లక్ష రూపాయలు కేటాయించ బడినవి.

### గద్వాలనుంచి రోడ్డు

అయిజ అలంపూరు రోడ్డును కలుపుతూ గద్వాలనుంచి 16 మైళ్ళ రోడ్డును వేయుటకు పూర్వపు హైదరాబాదు ప్రభుత్వం, భారత ప్రభుత్వంవారు ఒక పథకాన్ని మంజూరు చేశారు. ఈ రోడ్డు నిర్మాణానికి రూ. 12 లక్షలు ఖర్చు అవుతుంది. ఇందులో రాష్ట్ర ప్రభుత్వం మూడోవంతు, మిగిలిన భాగం కేంద్ర ప్రభుత్వం భరిస్తుంది. గత సంవత్సరమే పని ఆరంభమైంది. ప్రస్తుత సంవత్సరం పని కొనసాగించుటకు రాష్ట్ర ప్రభుత్వం తన వాటా క్రింద రూ. 1.50 లక్షలు మంజూరు చేసింది.

### నారాయణ ఖేడ్‌నుంచి నిజాంపేటకు రోడ్డు

మెదకు జిల్లాలోని నారాయణ ఖేడ్‌నుంచి నిజాంపేటకు గల 10 మైళ్ళ రోడ్డును రూ. 2 లక్షల ఖర్చుతో జిల్లా రోడ్డుగా మార్చి వేయుటకు సంకల్పించ బడింది. ఈ సంవత్సరం పని ఆరంభించుటకై రూ. 0.50 లక్ష కేటాయించ బడింది.

### రోడ్లకు నల్లటాపు వేయుట

1957-58 సంవత్సరంలో రూ. 12.70 లక్షల ఖర్చుతో ఈ క్రింద పేర్కొనబడిన రోడ్లకు నల్లటాపు వేయుటకు సంకల్పించ బడింది :-

(1) హైదరాబాదు - చాందారోడ్డు (మెదకుజిల్లా రూ. 1.50 లక్షలు).

(2) నర్సాపూరు - మెదకురోడ్డు (మెదకుజిల్లా రూ. 1.50 లక్షలు).

(3) హైదరాబాదు - అకోలా రోడ్డు (మెదకుజిల్లా రూ. 1 లక్ష).

(4) జడ్చర్ల - మహబూబునగరు రోడ్డు (మహబూబునగరు జిల్లా రూ. 0.50 లక్ష).

(5) హైదరాబాదు - మల్లేపల్లి రోడ్డు (హైదరాబాదు జిల్లా రూ. 1 లక్ష)

(6) హైదరాబాదు - హనుమకొండ రోడ్డు (హైదరాబాదు జిల్లా రూ. 1 లక్ష).

(7) హైదరాబాదు - హనుమకొండ రోడ్డు (నల్గొండ జిల్లా రూ. 1 లక్ష).

(8) హైదరాబాదు - చాందా రోడ్డు (కరీంనగరు జిల్లా రూ. 1.70 లక్షలు).

(9) డిచ్పల్లి - నిజామాబాదు రోడ్డు (నిజామాబాదు జిల్లా రూ. 1.50 లక్షలు).

(10) నర్కటపల్లి - నల్గొండ రోడ్డు (నల్గొండ జిల్లా రూ. 1 లక్ష).

(11) దేవరకొండ - మిర్యాలగూడా రోడ్డు మల్లేపల్లి నుంచి పెద్ద వూరుకు (హైదరాబాదు జిల్లా రూ. 1 లక్ష).

# "ఆంధ్రప్రదేశ్" పత్రిక చందా ఫారము

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాచార పౌరసంబంధముల శాఖ
డైరెక్టర్ గారికి,
హైద్రాబాద్ దక్కన్—1

అయ్యా,

నేను "ఆంధ్రప్రదేశ్" పత్రిక చందాదారును కాదలచుకున్నాను.————
తేదీన మనియార్డరు ద్వారా సంవత్సరచందా రూ 1-50 పైసలు పంపుతున్నాను.

పేరు......................................................................................................
(స్పష్టంగా)

చిరునామా..............................................................................................
(వివరంగా)
..........................................................................................
.....................................................................

దయచేసి "ఆంధ్రప్రదేశ్" పత్రిక తెలుగు/ఇంగ్లీషు/ఉర్దూ ప్రతిని పంపగలరు.

భవదీయుడు

తేదీ.............................  ..............................................

# "ఆంధ్రప్రదేశ్" ప్రకటన రేట్లు

—★—

'ఆంధ్రప్రదేశ్' పత్రికలో ఈ దిగువ రేట్లప్రకారం ప్రకటనలు స్వీకరించబడగలవు.

| వివరాలు | మూడు భాషల పత్రికలకు | | | ఒక భాష పత్రికకు | | |
|---|---|---|---|---|---|---|
| | పూర్తి పేజీ | సగం పేజీ | పావు పేజీ | పూర్తి పేజీ | సగం పేజీ | పావు పేజీ |
| | రూ | రూ | రూ | రూ | రూ | రూ |
| లోపలి పేజీ | 200 | 125 | 75 | 100 | 55 | 30 |
| వెనుకవైపు కవరు పేజీ | 350 | — | — | 150 | — | — |
| 2, 3 కవరు పేజీలు | 250 | — | — | 125 | — | — |

ఒక సంవత్సరం కొరకు స్థలమును కంట్రాక్టు తీసుకొన్నవారికి 20 శతి రిబేటు ఇవ్వబడుతుంది.

## షరతులు

1. సాంకేతిక వివరాలు: 10¾ × 8½" డెమ్మీ.
2. ముందరి టైటిల్ పేజీపై ప్రకటనలు వేయబడవు.
3. పావు పేజీకంటే తక్కువ ప్రకటనలు స్వీకరించబడవు.
4. ప్రకటించవలసిన విషయము, అది వేయబడవలసిన స్థలము మొదలగు వివరాలూ, దానికయ్యే మొత్తమూ ప్రతినెల 8వ తేదీలోపుగా ఈ కార్యాలయానికి చేరినట్లయితే, ఆ ప్రకటన మరుసటినెల పత్రికలో ప్రచురింపబడుతుంది. ప్రకటనకయ్యే మొత్తమును మనియార్డరు ద్వారాగాని, లేక క్రాస్ చేయబడని డిమాండు డ్రాఫ్ట్ ద్వారాగాని పంపవలెను. డిమాండుడ్రాఫ్టు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాచార పౌర సంబంధముల శాఖ డైరెక్టర్, హైదరాబాదు–దక్కన్ పేరిట వ్రాయబడవలెను.
5. ప్రకటన నిమిత్తమై పంపబడు బ్లాకుల విషయంలో తగు జాగ్రత్త వహింపబడుతుంది. అయితే మిషను మీద బ్లాకులు గనుక పగిలిపోయినట్లయితే అందుకు ఈ శాఖ బాధ్యతవహించదు.
6. ప్రకటన ఎంత స్థలంలో ఏవైనం ప్రకారం వేయవలసింది, ఒక భాష పత్రికలో వేయవలెనా, లేక మూడు భాషల పత్రికలలో వేయవలెనా అనే వివరాలను స్పష్టంగా తెలియపరచాలి. ఉత్తర ప్రత్యుత్తరాలను, పైకమును ఈ దిగువ చిరునామాకు పంపవలెను.

డైరెక్టర్,
సమాచార పౌరసంబంధముల శాఖ
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం
హైదరాబాదు దక్కన్ — 1.

# దేశంతోపాటు మీరుకూడా అభ్యుదయం పొందండి!

## మీరు మిగుల్చుకున్న డబ్బును భారత ప్రభుత్వ చిన్న మొత్తముల పొదుపు పథకమునకు పెట్టుబడి పెట్టండి!

*భారత దేశం యొక్క*

సామాజికాభివృద్ధి కార్యక్రమమునకు, గొప్పనదీలోయ ప్రాజెక్టులకు,
రైలు మార్గములు, రోడ్ల అభివృద్ధికి సహాయపడండి!

*మీ డబ్బును ఈ క్రింది గ్యారంటీడ్ సెక్యూరిటీలలో దేనిలోనైనా పెట్టుబడి పెట్టండి!*

| | |
|---|---|
| *12 సంవత్సరముల ట్రెజరీ ప్లాన్ సేవింగ్స్ సర్టిఫికెట్లు* | మెచ్యూరిటీ పొందినమీదట నూటికి ఏడాదికి 5.41 వంతుల చొప్పున వడ్డీ ఇవ్వబడుతుంది. ఇవి రూ. 5 లవి మొదలు రూ. 5 000 లవి కూడా లభిస్తాయి. వ్యక్తిగతంగా ఒక్కొక్కరు రూ. 25,000 ల వరకు కొనవచ్చును. |
| *10 సంవత్సరముల ట్రెజరీ సేవింగ్సు డిపాజిట్ సర్టిఫికెట్లు* | ఏడాదికి నూటికి 4 వంతులు చొప్పున వడ్డీ ఇవ్వబడుతుంది. ఒక్కొక్కటి రూ. 100 లవి మొదలు రూ. 25,000 లవి కూడా లభిస్తాయి. |
| *పోస్టాఫీసు సేవింగ్సు బ్యాంకుఅకౌంట్లు* | డిపాజిట్లపై రూ. 10,000 ల వరకు నూటికి 2½ వంతులచొప్పున వడ్డీ ఇవ్వబడుతుంది. శేషముపై రూ .15,000 ల వరకు నూటికి 2 వంతుల చొప్పున వడ్డీ ఇవ్వబడుతుంది. |

### 15 సంవత్సరముల ఆన్యూటీ సర్టిఫికెట్లు

| | |
|---|---|
| జారీచేయబడు ధరలు : రూ. 3,500, రూ. 7,000, రూ. 14,000 రూ. 28,000 వ్యక్తిగతంగా ఒక్కొక్కరు రూ. 28,000 ల వరకు కొనవచ్చును. | నూటికి ఏడాదికి 3½ వంతుల చక్రవడ్డీతో నెలవారి వాయిదాలుగా 15 ఏండ్ల లోపున తిరిగి చెల్లించబడుతవి. |

## ఆదాయపు పన్ను లేకుండా మీకు మంచి ఆదాయం లభిస్తుంది!
## భారతదేశ ఉజ్జ్వల భవిష్యత్తుకొరకై పెట్టుబడి పెట్టండి!

ఇతర వివరములకు, ఈ పెట్టుబళ్ళకు సంబంధించిన నియమావళికొరకు:

**నేషనల్ సేవింగ్సు కమీషనర్, సిమ్లా చిరునామాకుగాని లేక**
**రీజనల్ ఆఫీసరు, హైద్రాబాదు (దక్కన్)**

చిరునామాకు గాని వ్రాయవలెను.

